# పోలియో రహిత భారతదేశం!

PULSE POLIO IMMUNIZATION

DECEMBER 7, 1996
JANUARY 18, 1997

లక్ష్యం సమీపిస్తున్నది!
మరో అడుగు ముందుకు వేద్దాం!

జాతీయ వ్యాధినిరోధక తేదీలు :

## డిసెంబర్ 7, 1996
## జనవరి 18, 1997

తల్లితండ్రులారా!

* పాపాయి అనారోగ్యంతోనో, విరోచనాలతోనో ఇబ్బంది పడుతున్నప్పటికీ,
* పాపాయికి అంతకుముందే పోలియో చుక్కలు వేయించి ఉన్నప్పటికీ,

నూటికి నూరుశాతం పరిరక్షణ సాధించడానికి



### గుర్తుంచుకోండి!

జాతీయ వ్యాధినిరోధక తేదీలలో మీ (ఐదేళ్ళలోపు) పిల్లలను
సమీప వ్యాధినిరోధక శిబిరం/ కేంద్రానికి తీసుకుపోయి

**ఓరల్ పోలియో వాక్సిన్**

**రెండు అదనపు చుక్కలు వేయించండి!**



దేశభవిష్యత్తు –ఆరోగ్యవంతులైన
మన పిల్లల భవిష్యత్తు మీదే
ఆధారపడి ఉన్నది!



POLIOPLUS

**క్రీ.శ. 2000 నాటికి
పోలియో రహిత
భారతదేశాన్ని
సృష్టించడానికి కృషి చేద్దాం!**



# మీ క్రికెట్ హీరోని కలవండి నేడు!



World Cup-96 Achievers Collection

# FREE

## Cricketer Card With Every Pack






రూ. 13.50 మాత్రమే !

- రుచిగలది
- పొదుపైనది
- చేయడం తేలిక

పిల్లల్లారా, త్వరపడండి! ఈ సమయం 30వ ఏప్రిల్ 1997 వరకూ



క్రికెట్ అంటే ఉత్సాహంగల పిల్లల్లారా, వినండి!
మీకు మనసైన రస్నా స్ప్రెడ్ మేకర్ ప్యాక్ తెరవడంతోనే ఉరకలేసే ఉత్సాహం మొదలవుతుంది.
మీ మమ్మీ 500 గ్రాముల రుచిగల స్ప్రెడ్ మీకోసం చేసిపెట్టేదని వింత సంగతి కాదు, మేముచెప్పేది. ఈ సారి ఎంతో ప్రత్యేక మైనది ఇంకొకటిఉంది కేవలం మీకోసం. మీరు మనసుపడే రస్నా స్ప్రెడ్ మేకర్ ప్రతి ప్యాక్‌లోనూ ఉత్సాహం రేకెత్తించే ఒక క్రికెటర్ కార్డ్‌వుంది. అదికూడా, ఉచితంగా!!
ఇక బోనస్ ఏమిటంటే, మీరు కావాలని కోరుకునే రుచిగల స్ప్రెడ్ వుండనేవుంది! ఇక ఆ శాండ్‌విచ్‌ని, చపాతీని లేదా పూరీని రుచిభరితంగా చేసుకోండి - రస్నా స్ప్రెడ్ మేకర్‌తో.

ప్యాక్‌లు యీ ఆఫర్ లేకుండా కూడా లభ్యమవుతాయి.

Mudra:EAMR:9610 Tel.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'  సంచాలకుడు : నాగిరెడ్డి

## విద్యాలయాలలో రాజకీయాలు

విద్యార్థులూ, తల్లిదండ్రులూ 1996వ సంవత్సరాన్ని చిరకాలం గుర్తుంచుకుంటారు. ఈ సంవత్సరంలోనే ఒక రాష్ట్ర ఉన్నత న్యాయ స్థానం - రాజకీయ పక్షాలు పాఠశాలలకు దూరంగా ఉండాలని చారిత్రాత్మకమైన తీర్పునిచ్చింది. మిగతా రాష్ట్రాలలోని తల్లిదండ్రులు కూడా ఈ విషయంగా ఉన్నత న్యాయస్థానాలకు వెళ్ళే సూచనలు కనిపిస్తున్నాయి!

విద్యాసంవత్సర ఆరంభంలో విద్యార్థుల మధ్య జరిగే ఎన్నికలలో రాజకీయ పక్షాలు, ఇటీవల తమ తరఫున పోటీచేసే విద్యార్థులకు నోటీసులు, పోస్టర్లు, బ్యానర్లు, వాహనాలు,డబ్బు అంటూ రకరకాలుగా సహాయ సహకారాలు అందిస్తున్నాయి. అందువల్ల విద్యాలయ వాతావరణంఅల్లకల్లోలమవుతున్నది. ఆ తరవాత విద్యాలయాలకు వెలుపల కూడా కక్షలు, కావేషాలు, హింసాత్మక చర్యలు కొనసాగుతున్నాయి!

విద్యార్థుల సొంత శక్తి సామర్థ్యాలతో, సత్ప్రవర్తనతో, ఎన్నికలలో గెలుపొందే మంచిరోజులు దూరమై, రాజకీయ పక్షాల అంగబలంతో, అర్థిక సాయంతో రంగంలో దిగే దారుణమైన రోజులు దాపురించాయి. అందుకే ఉన్నత న్యాయస్థానం ఇటువంటి తీర్పునిచ్చి, ప్రధానోపాధ్యాయులకు పది ఆదేశసూత్రాలను కూడా జారీచేసింది. విద్యాలయాలలో శాంతి నెలకొల్పడానికి అవసరమైతే పోలీసు సహాయం కూడా కోరవచ్చు అన్నది వాటిలో ముఖ్యమైనది. విద్యాలయాలలో ప్రశాంతతను, క్రమశిక్షణను కాపాడడానికి ఈ తీర్పు దోహదం చేస్తుంది. విద్యాలయాలలో జ్ఞానార్జనకు అనువైన ప్రశాంత వాతావరణం నెలకొనాలంటే విద్యార్థులు తమ బాధ్యతల నెరిగి నడుచుకోవడం చాలా అవసరం!

**పాఠకులందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నాము!**

సంపుటి : 100  జనవరి '97  సంచిక : 1

విడిప్రతి : 6.00  సంవత్సర చందా : 72.00






Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

## CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
Chandamama Buildings
Vadapalani, Madras - 600 026.

## వార్తలు – విశేషాలు:

# పర్షియన్ సింధుశాఖ ఏడుదేశాలు

భారత చరిత్రను చదివే విద్యార్థులకు మన ఏడు ఈశాన్య రాష్ట్రాల గురించి తెలిసే ఉంటుంది. అదేవిధంగా పర్షియన్ సింధుశాఖ పరిసరాలలో ఏడుదేశాలు ఉన్నాయి. వాటిని 'సెవెన్ సిస్టర్స్'అని అంటారు. ప్రస్తుతం వాటిని సంయుక్తంగా యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ (యు.ఏ.ఇ) అని అంటారు. రాస్ అల్ ఖాయ్‌మా, ఉమాల్ ఖాయ్‌వాన్, అజ్మాన్, షార్జా, దుబాయ్, అబుధాబీ, పుజాయ్‌రా అనే ఏడు దేశాలు ఉత్తర దక్షిణంగా విస్తరించి ఉన్నాయి. యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, డిసెంబర్ 2వ తేదీ రజతోత్సవాలు జరుపుకున్నాయి.

నూటయాభై సంవత్సరాలకు పూర్వం ఆ దేశాలను 'ట్రూసియల్‌స్టేట్స్'అని పిలిచేవారు.1820వ సం॥ ప్రారంభంలో బ్రిటన్‌తో ఒక ఒడంబడిక కుదుర్చుకోవడం వల్ల వాటికా పేరు వచ్చింది. స్థానిక పాలకులయిన షేక్స్‌తో బ్రిటన్ తమ సేనలను అక్కడ ఉంచడానికి ఒక ఒడంబడిక కుదుర్చుకున్నది. అబుధాబీకి చెందిన షేక్ జాయేద్ ఖలీఫా అల్ నాహ్యాన్ సుదీర్ఘకాలం అంటే – 1855 నుంచి 1909 వరకు తన పరిపాలన సాగించాడు. ప్రస్తుత ఎమిరేట్స్ ప్రెసిడెంట్ సోదరుడు షేక్‌షక్బట్ 1928లో సింహాసనం అధిష్ఠించాడు.ఆయన తమ్ముడుషేక్ జాయేద్ స్థానిక మతగురువు దగ్గర విద్య పూర్తిచేసి, ఎడారులలో విస్తృతంగా పర్యటనలు జరిపారు.షేక్ అతన్ని ఎడారులలో చమురు బావులు తవ్వే బ్రిటిష్ కంపెనీలకు సాయపడమన్నాడు. ఆయన చమురు పరిశ్రమను గురించి క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. చమురు బావులే తమ దేశ భవిష్యత్తుకు బంగారుబాట వేయగలదని గ్రహించాడు.

ఇంతలో ఆయన తూర్పు ప్రాంతాలలో షేక్ ప్రతినిధిగా నియమించబడ్డాడు. ఆయన బాధ్యతలు మరింత పెరిగాయి. అల్–అయిన్ ప్రాంతాన్ని వ్యావసాయిక భూమిగా మార్చాడు. ఇది ఆ ప్రాంతప్రజల సామాజిక జీవితంలో పెద్దమార్పును తీసుకువచ్చింది.

1996 ఆగస్టు 6వ తేదీ ఆయన అబుధాబీ పాలకుడయ్యాడు. చమురు బావులలో వచ్చే ఆదాయంతో ప్రజాసంక్షేమ పథకాలను చేపట్టి, దేశాభివృద్ధికి కృషి చేశాడు. బ్రిటన్, సింధుశాఖ నుంచి తమ సేనలను ఉపసంహరించుకోవాలనుకున్నది. దాంతో ఒడంబడికలు కూడా అంతానికి వచ్చాయి. షేక్ జాయేద్ మిగతా అరు దేశాల నాయకులను కలుసుకుని ఏడుదేశాల ఫెడరేషన్ ఏర్పాటు చేయడానికి పిలుపునిచ్చాడు.

1971వ సం॥ జూలై 18వ తేదీ ఏడుదేశాలతో యునైటెడ్ అరబ్ ఏమిరేట్స్ అనే ఫెడరల్ స్టేట్ ఏర్పాటు చేసుకోవాలనే చారిత్రాత్మకమైన నిర్ణయం తీసుకున్నారు. నాలుగు నెలల తరవాత డిసెంబర్ 2వ తేదీ రాజ్యాంగ శాసనం అమలులోకి వచ్చింది. అబుధాబీ షేక్ జాయేద్ బిన్ సుల్తాన్–ఏమిరేట్స్ ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డాడు. ఐదేళ్ళ విరామంతో మళ్ళీ మళ్ళీ ఆయనే ప్రెసిడెంటుగా ఎన్నికవుతున్నాడు.




ఫెడరేషన్ ఏర్పాటు తరవాత, ఏడుదేశాలూ, వివిధ రంగాలలో సత్వర అభివృద్ధిని సాధిస్తున్నాయి. ఉదాహరణకు విద్యారంగాన్ని తీసుకుంటే-1971లో అక్కడ 147 పాఠశాలలే ఉండేవి. వృత్తి కళాశాలలు గాని, విశ్వవిద్యాలయం గానీ లేవు. ఇవాళ 900 పైగా పాఠశాలలు ఉన్నాయి. ఒక వైద్య కళాశాల ఏర్పాటయింది.అల్ అయిన్‌లో 1977వ సం॥లో ఏమెరేట్స్‌యూనివర్సిటీ స్థాపించబడింది. ఈ విశ్వవిద్యాలయంలో దాదాపు 15,000 మంది విద్యార్థులు చదువుతున్నారు. వీరిలో కొందరు విదేశీయులు కూడా ఉండడం విశేషం. దేశంలో 84 శాతంప్రజలు అక్షరాస్యులు. మధ్య ప్రాచ్యదేశాలలో కెల్లా యు.ఎ.ఇ. పిల్లలే చాలా ఆరోగ్యంగా ఉన్నారని 1996లో యునిసెఫ్ వెలువరించిన ఒక నివేదిక తెలియజేస్తున్నది!



# అతిథిమర్యాద

ఒకానొకప్పుడు క్షేత్రపురమనే గ్రామంలో, సర్వానందుడనే భాగ్యవంతుడుండేవాడు. ఆయన అతిథులకు సకల మర్యాదలూ చేసి, అపరిమితంగా గౌరవించి ఆదరించే వాడు. తనలాగా అతిథి మర్యాదలు చేసే వారు లేనేలేరని ఆయన నమ్మకం.

వచ్చిన అతిథులందరూ సర్వానందుణ్ణి పొగిడి వెళ్ళేవారు. అందుకు సర్వానందుడు మహా సంబరపడిపోయేవాడు. కానీ ఒకసారి గోపాలుడనే అతడు, ఆయన వద్ద అతిథి సత్కారం పొందాక, "శ్రీపురంలో రంగ నాధుడితర్వాత అతిథి మర్యాదకు నిన్నే చెప్పుకోవాలి," అని మెచ్చుకున్నాడు.

తనను శ్రీపురం రంగనాధుడి పేరు చెప్పి చిన్నబుచ్చినందుకు సర్వానందుడు నొచ్చుకుని, "ఆ రంగనాధుడెవరు? ఆయన లోనిప్రత్యేకత ఏమిటి?" అని గోపాలుణ్ణి అడిగాడు.

గోపాలుడు ఆశ్చర్యంగా, "శ్రీపురం రంగ నాధుడి గురించి తెలియదా? అతిథి మర్యాద కాయన పెట్టింది పేరు. ఆయన ప్రత్యేకతను మాటల్లో చెప్పలేం. ఒకసారి శ్రీపురం వెళ్ళు. నీకే తెలుస్తుంది," అన్నాడు.

ఇక సర్వానందుడు ఉండబట్టలేక పోయాడు. మర్నాడే ఆయన ప్రయాణమై శ్రీపురం చేరుకుని, సులువుగానే రంగనాధుడి ఇంటికి వెళ్ళాడు.

రంగనాధుడిది చిన్న పెంకుటిల్లు. ఇంటి అరుగు మీదే ఆయన కూర్చుని ఉన్నాడు. సర్వానందుణ్ణి చూస్తూనే ఆయన వివరాల డిగితెలుసుకున్నాడు. సర్వానందుడు అసలు విషయం చెప్పక, తను వజ్రాలు అమ్మడానికి వచ్చానన్నాడు.

"వజ్రాలు అమ్మేమాటైతే శంభునాధు డింటికి వెళ్ళండి. ఆయన మీకు చక్కని ధర వచ్చేలా చేస్తాడు. వజ్రాలను చూసి

జొన్నలగడ్డ రామలక్ష్మి

వాటి సరైన విలువను అంచనా వేయడంలో, ఆయనకు ఆయనే సాటి," అన్నాడు రంగ నాథుడు.

"మీ ఇంట అతిథిగా ఉంటానంటే మీకే మైనాఅభ్యంతరమా?"అన్నాడుసర్వానందుడు వెంటనే.

"అయ్యా! తమరు చూడ్డానికి గొప్ప వారిలా వున్నారు. నేను బీదవాణ్ణి. తమకు తగినవిధంగామర్యాదచేయలేను," అన్నాడు రంగనాథుడు.

"నాకు మీ ఇంట్లోనే బస చేయా లనిఉంది. మీకిష్టం లేదంటే శంభు నాథుడింటికి వెళతాను," అన్నాడు సర్వా నందుడు.

ఆ వెంటనే రంగనాథుడు, సర్వా నందుణ్ణి గౌరవంగా లోపలకు ఆహ్వానించి పెరట్లోకి తీసుకు వెళ్ళి, పాదప్రక్షాళనానికి నీళ్ళిచ్చాడు. కాసేపటికి రంగనాథుడి భార్య భోజనం సిద్ధం చేసింది. పిండివంటలు లేకున్నాచేసిన పదార్థాలు రుచిగా ఉన్నాయి.

భోజనమయ్యాక సర్వానందుడు, శంభు నాథుడింటికి వెళతానన్నాడు. అందుకు రంగనాథు డంగీకరించక, "ఏరి కోరి నా ఇంటికి వచ్చారు. ఈ రోజు నా మర్యాద లందుకున్నాకనే, రేపుమిమ్మల్ని విడిచి పెడతాను," అన్నాడు.

అంతకాలం ఆ ఇంట్లో ఎలా ఉండాలా అని సర్వానందుడిబ్బంది పడ్డాడు. రంగ నాథుడి ఆతిథ్యం అత్యంత సామాన్యంగా వుంది. తన ఇంటికి వచ్చిన అతిథులకు తను రకరకాల పిండివంటలు చేయించి పెడతాడు. అయినా రంగనాథుడి ఆతిథ్యం గోపాలుడి దృష్టిలో గొప్పదెందుకయిందా అని ఆయన ఆలోచనలో పడ్డాడు.

అంతలో అక్కడికి రంగనాథుడి కుటుంబాసభ్యులందరూ వచ్చారు. వారిలో





TL-F-2



మాటలు శ్రద్ధగా విని, వారి ప్రావీణ్యాన్ని ప్రదర్శించే అవకాశమివ్వాలి!" అనుకున్నాడు సర్వానందుడు మనసులో.

ఆ తర్వాత ఆయన మర్యాదకు వాళ్ళ ఊరి విశేషాలడిగాడు. అందుకు రంగ నాధుడు, "రోజూ చూసే ఊరే కదా, మాకేమీ విశేషంగా అనిపించదు. మాఊళ్ళో పురాతన ఆలయాలున్నాయి. పళ్ళతోటలున్నాయి. ఎన్నో ఏళ్ళనాటి కోట ఒకటి ఉంది. వీటి పట్ల మీకు ఆసక్తి వుంటే, మా పిల్లలు మిమ్మల్ని వెంటబెట్టుకు వెళ్ళి చూపిస్తారు; అయితే ప్రయాణం కాస్త అలసటతో కూడుకుని ఉంటుంది. చాలా దూరం నడవాలి కదా!" అన్నాడు.

నిజానికి సర్వానందుడికి ఊరు చూసే ఉద్దేశ్యం లేదు. అందువల్ల ఆయన తనకు అలసటగా వున్నదని తప్పించుకుని,ఆ ఇంట్లో వారికేయే విద్యల్లో ప్రావీణ్య ముందో అడిగి తెలుసుకున్నాడు. రంగనాధుడు బొమ్మలు గీయగలడు. ఆయన భార్యచక్కగా పాడు తుంది. తమ్ముడు కవిత్వం చెప్పగలడు. పిల్లలు మట్టితో రకరకాల అందమైన బొమ్మలు చేస్తూంటారు.

సర్వానందుడు అందరి ప్రావీణ్యాన్నీ చూస్తానన్నాడు. అందుకు రంగనాధుడు ఒప్పుకోక, "మీకింకా ప్రయాణ బడలిక తగ్గలేదు. అలాంటప్పుడు కొంత విసుగ్గా ఉంటుంది. ఈ రోజుకు మీరు విశ్రాంతి తీసుకోండి," అన్నాడు.

అయినా, సర్వానందుడు బలవంత పెడితే,"మీరు మా ఇంట్లో అందరికీ నచ్చారు. మరిన్ని రోజుల పాటు మీరు మా ఇంట్లో

రంగ నాధుడి భార్య, పిల్లలు, తమ్ముడు కూడా ఉన్నారు.

అందరూ సర్వానందుణ్ణి క్షేత్రపురం విశేషాలడిగి, ఆయన చెప్పేవన్నీ శ్రద్ధగా విన్నారు. సర్వానందుడికి సంగీతం వచ్చు నని మాటల సందర్భంలో తెలియడంతో, ఆయన్ను బలవంతపెట్టి రెండు పాటలు పాడించారు.

ఆనాటి వరకూ సర్వానందుడి మాట లను అంత శ్రద్ధగా విన్నవారూ లేరు; ఆయన్ను అడిగి పాడించుకున్నవారూ లేరు. తను బాగా పాడాడని వాళ్ళు మెచ్చుకుం టుంటే, ఆయనకు చాలా సంతోషం కలి గింది.

"అతిథి మర్యాద అంటే కడుపు నిండా భోజనం పెట్టడమే కాదు, అతిథులు చెప్పే

వుండాలని మా కోరిక. రేపటి నుంచి ప్రారంభించి, రోజుకొకరు చొప్పున మా విద్యలు ప్రదర్శిస్తాం. అవయ్యేదాకా మా ఇంట్లోనే ఉండాలి మరి!" అన్నాడు రంగనాథుడు.

సర్వానందుడికెంతో సంతోషమయింది. ఆయనకప్పుడు వినే ఓపిక నిజంగానే లేదు. అతిథికి తనను గురించి చెప్పుకోవడంలో గృహస్థు ఎలా ఉండాలో ఆయనకప్పుడు తెలిసింది: "ఇక మీదట ఇంటికొచ్చిన వారికి నేను కూడా, నా గురించి ఎక్కువ చెప్ప కూడదు!" అనుకున్నాడాయన. అంతే కాక వచ్చినవాడు ఎప్పుడు వెళతాడా అని కాక, అతణ్ణి నాలుగు రోజుల పాటు ఇంట్లో వుంచుకోవాలని తపన పడుతున్నట్లుండాలని కూడా ఆయనకు అర్థమయ్యింది.

రంగనాథుడి భార్య,సర్వానందుడికి రాత్రి భోజనంలో అన్నీ ఇష్టమైన వంటకాలు చేసింది. మధ్యాహ్నం ఆయనను మాటలలో పెట్టితెలుసుకోవడంవల్ల, ఆమెకు అది సాధ్యమయ్యింది.

భోజనాలయ్యాక అందరూ కాస్సేపు కబుర్లాడుకున్నారు. తర్వాత రంగనాథుడు, సర్వానందుడినొకగదిలోకితీసుకువెళ్ళి, "మీకు తీరని కోరిక ఏదైనా ఉంటే చెప్పండి. తీర్చ గలను," అన్నాడు.

సామాన్యుడైన రంగనాథుడు, భాగ్యవంతుడైన తనకు తీరని కోరిక తీర్చ గలగడం అసాధ్యం! అయినా, ఆయన అలా అడిగినందుకు తగువిధంగా బుద్ధి చెప్పాలనిపించి, "ఇలా అడగడం మీకు భావ్యం కాదు. మీరు తీర్చలేనిది అడిగా నన్న బాధ నాకు కలుగుతుంది. నేనడిగింది తీర్చలేక పోయా నని మీరుబాధపడతారు. ఎవరైనా, ఎవరి కైనా తమ సమర్థతను బట్టే వాగ్దానాలు చేయడం ధర్మం. కాదంటారా?" అన్నాడు సర్వానందుడు.





"మీరు చెప్పింది అక్షరాలా నిజం. తీర్చ గలను కాబట్టే, నేను మిమ్మల్నిలా అడి గాను. నిస్సంకోచంగా మీ కోరిక చెప్పండి!" అన్నాడు రంగనాధుడు.

"దేవలోకం వెళ్ళి అప్సరసల నాట్యం చూడాలనుంది," అన్నాడు సర్వానందుడు కాస్త చిరాకుగా.

రంగనాధుడాయనకు మంచం చూపించి, "ఇక విశ్రాంతి తీసుకోండి. మీ కోరిక తీరు తుంది," అని గదిలోంచి బయటకు వెళ్ళి పోయాడు.

సర్వానందుడు మంచం మీద పడుకు న్నాడు. మరుక్షణంలోనే ఆయనకు ఒళ్ళు తెలియని నిద్ర పట్టేసింది. ఆ నిద్రలో ఒకకల. ఆ కలలో ఆయన దేవలోకం వెళ్ళాడు. అక్కడ అప్సరస నాట్యం చేస్తూంటే చూశాడు.

మర్నాడు నిద్రలేచేసరికి ఆయనకు ఎంతో తృప్తిగా ఉంది. వెళ్ళి రంగనాధుణ్ణి కలుసు కుని, కృతజ్ఞతలు తెలుపుకుని, తనకాకల ఎలా వచ్చిందని అడిగాడు.

"అది కల కాదు, నిజం!" అన్నాడు రంగ నాధుడు. తరవాత అసలు విషయం సర్వా నందుడికి చెప్పాడు:

ఒకసారి రంగనాధుడి ఇంటికి వచ్చిన అతిథి, ఆయనచేసిన మర్యాదల కెంతో తృప్తి పడి, "నాయనా! నేను తపస్సంపన్నుణ్ణి. నా శక్తిలో కొంత ఎవరైనా ఉత్తముడికి ధార పోయాలని నా కోరిక. ఇన్నాళ్ళకు నా అన్వే షణ ఫలించింది. ఇవ్వాళ నుంచి ప్రతి రోజూ నీకు ఎంత అసాధ్యమైనదైనా సరే ఒక కోరిక తప్పక తీరుతుంది. దానితో అంతులేని సంపదలకు వారసుడివై కలకాలం ఇలాగే గొప్పగా అతిథిమర్యాదలు చేస్తూ సుఖంగా జీవించు," అన్నాడు.

అందుకు రంగనాధుడు ఏమాత్రమూ సంతోషించక, "స్వామీ! నా అదృష్టం కొద్దీ తమరు నా ఇంటికి అతిథిగా వచ్చారు. మీవరం ప్రమాదకరమైనది..ఎందుకంటే కోరిక మనసుకు సంబంధించినది.మనసును అదుపుచేయడం చాలాకష్టం. అందువల్ల నేను నా వరాన్ని దురుపయోగం చేసిఎందరికో హానికలిగించవచ్చు.

ఈవరం ఇంద్రియ నిగ్రహమున్న, తమ బోంట్లకే తప్ప సామాన్యుడి నైన నాకు తగదు," అన్నాడు.

"పోనీ,ప్రతిరోజూ నీ ఇంట నూరు బంగారు కాసులు కురిసేలా వరమిచ్చేదా?" అన్నాడు అతిథి.

"స్వామీ! అయాచితంగా అంత బంగారం నాకు వలదు. మనిషి అన్నీ స్వయంకృషితో సాధించాలి. అలా సాధించిన దాంతోనే అనుభవించాలి. నేను అతిథిమర్యాద చేసినా, స్వయం కృషితో సంపాదించిన ధనంతోనే చేస్తాను. ఈ వరం కూడా వద్దు," అన్నాడు రంగనాథుడు.

"పోనీ, అతిథులు కోరిన వస్తువులు - బంగారం లాంటిది ఇవ్వగలిగే వరం ఇవ్వనా?" అన్నాడు అతిథి.

"స్వామీ! అప్పుడది నా స్వయంకృషిఫలం కాదు గదా! కాబట్టి, అతిథుల మనసును సంతోష పెట్టే శక్తిని నా కివ్వండి," అన్నాడు రంగనాథుడు.

"అతిథుల మనసుకు సంతోషం - కలగాలంటే, ధన కనక వస్తు వాహనాదులవసరం కాదా?" అన్నాడు అతిథి.

"అలా ఇచ్చే మాటైతే, నా ఇంటికి ఆతిథ్యం కోసం కాక దానంకోసం వస్తారు. నేను దాతను కాదల్చుకోలేదు. దూరప్రాంతాల నుంచి వచ్చిన వారికి, అవసరపడితే, ఆశ్రయమిచ్చి ఆదరించాలని నా కోరిక.

మనిషి కోరికలన్నీ మన సుతో ముడిపడి ఉన్నాయి. మనసు తృప్తి పడితే మనిషికి కోరికలుండవు. మన సుకు తృప్తి కలిగించ గల శక్తి, నాకివ్వండి," అన్నాడు రంగనాథుడు.

అప్పటికి అతిథికి అసలు విషయంఅర్థమై, "తమకు తాముగా, నీ ఇంటికి వచ్చిన వారికి మాత్రమే ఆతిథ్యమిస్తూండు. రోజు కొక్కసారి, నీ అతిథుల తీరని కోరికలు రాత్రిపూటనిద్రలో తీరుతాయి. వారి మనసుకు పూర్తి తృప్తి కలుగుతుంది," అని వరమిచ్చి వెళ్ళాడు.

ఆనాటి నుంచీ రంగనాథుడు, అదే విధంగా అతిథిమర్యాదలు చేస్తూవస్తున్నాడు.

ఈ వివరాలు వినగానే సర్వానందుడి సందేహాలన్నీ పటాపంచలై పోయాయి. రంగనాథుడు తనకోసం అద్భుతశక్తులను కూడా వాడుకోడు. అతిథిని, శరీరం కంటే ఎక్కువగా మనసును సంతోష పెట్టడానికే ప్రయత్నిస్తాడు. అందుకే, తనఆతిథ్యం స్వీకరించిన గోపాలుడు, ఆయనను అంతగా మెచ్చుకుని, ఒకసారి వెళ్ళి చూసి రమ్మన్నాడు!

సర్వానందుడు తన గ్రామానికి తిరిగి వెళ్ళాక, తన పాత పద్ధతులు మార్చు కున్నాడు. ఎవరైనా అతిథులు తనను మెచ్చు కుంటే "శ్రీపురం రంగనాథుడి తర్వాతే నేను!" అని అంటూండే వాడు.



# జంతునైజం

శివయ్య కాలినడకన కాశీయాత్ర చేసి తిరిగి వచ్చాడు. ఆయన ఊరి రచ్చబండ దగ్గర చేరిన వారితో తన యాత్రానుభవాలు చెబుతూ, "ప్రయాణంలో నాకు ఇద్దరు అవిటివాళ్ళు తటస్థపడ్డారు. మొదటివాడికి, నేను బసచేసిన చోట తిండి పెట్టి, కొంత డబ్బు కూడా ఇచ్చాను. రెండవ వాడిక్కూడా మొదటి వాడిలాగే సాయం చేశాను.

"నేను తిరిగి వచ్చేప్పుడు, ముందుగా నాకు రెండో అవిటివాడు కనిపించాడు. వాడిప్పుడు దారి పక్కన చిన్న ఆశ్రమం కట్టుకుని, గొప్ప ఋషి పుంగవుడిలా దండ కమండలాలతో కూర్చుని ఉన్నాడు. వాడు నన్ను చూసి గుర్తుపట్టనట్టు వూరుకున్నాడు. వాడి శిష్యులు, వాడు మహాద్భుత శక్తులు గలవాడంటూ, నమ్మిన వాళ్ళనుంచి కానుకలు వసూలు చేస్తున్నారు.

"కొంత ప్రయాణం తర్వాత నాకు మొదటి అవిటివాడు కనిపించాడు. వాడు వెంటనే నన్ను గుర్తుపట్టి, నేను బసలో వున్న రెండు రోజులూ చిన్న చిన్న పనులు చేసి పెడుతూ, ఎంతో భక్తి శ్రద్ధలు చూపాడు. నాకొచ్చిన సందేహం ఏమంటే – అవిటి వాళ్ళిద్దరూ అంత భిన్నంగా ఎందుకువ్రర్తించారని?" అన్నాడు.

అందుకు ఊరిపెద్ద, "శివయ్యా! కుక్కకు తిండిపెట్టు, అది నీ మీద ఈగను వాలనీయదు. అదే పిల్లికి పాలు పోయి; నీ చేత దువ్వించుకుంటుంది, సేవలు చేయించు కుంటుంది. కుక్క తనకు తిండి పెట్టే వాడిని దేవుడనుకుంటే, పిల్లి తనే దేవుణ్ణనుకుంటుంది. నువ్వు కాశికి వెళుతూ మొదట చూసిన అవిటివాడిలో కుక్కనైజం ఉంటే, రెండవ అవిటివాడు పిల్లినైజం కనబరిచాడు. మనిషి కూడా జంతువే. అయితే, అతనికి ఆలోచన ఉండటం వలన జంతువులనుంచి వేరయ్యాడు.కాని మనలో చాలామంది జంతునైజాన్ని పాటిస్తూంటారు!" అని వివరించాడు. - రామవరపు గణేశ్వరరావు.





# సామ్రాట్ అశోక

మగధసామ్రాజ్య రాజధాని ఉద్యాన వనాలతో, ఫలవృక్షాలతో నిండిన సుందర నగరం. నగర ప్రజలకు ప్రకృతి అంటే ఎంతో మక్కువ. అందుకే రాజమార్గాలకూ, వీధులకూ ఇరువైపులా నీడనిచ్చే పుష్ప, ఫల వృక్షాలు నాటి పెంచారు. నగరంలో ఎక్కడ చూసినా పరిమళ పుష్పాలే. ఈ కుసుమాల కారణంగానే నగరంలో ఒక భాగానికి కుసుమపురం అని పేరు వచ్చింది. ఇక్కడ పాటలీపుష్పాలు విరివిగా పూయడం వల్ల ఈ నగరానికి పాటలీపుత్రం అనే సార్థక నామం ఏర్పడింది.

గంగా, సోనే నదులు సంగమించే చోట, దాదాపు రెండువేలా ఐదువందల సంవత్సరాలకు పూర్వం అజాతశత్రువు అనే రాజు ఒక కోటను నిర్మించాడు. ఆ తరవాత రెండు శతాబ్దాలకు చంద్రగుప్తుడనే రాజు ఆ కోటను విస్తరించి, బలపరిచాడు. ఇప్పుడు బ్రహ్మాండమైన ఆ కోటలో ఐదువందలా డెబ్బై బురుజులూ, అరవైనాలుగు ద్వారాలూ ఉన్నాయి!

మగధను పాలించిన నందవంశం రాజులకు ఎదురుతిరిగాడు చంద్రగుప్తుడు. పసివాడుగా ఉన్న చంద్రగుప్తుణ్ణీ, అతని తల్లినీ నందవంశీకులు అవమానించారు. ఆఖరికి చంద్రగుప్తుణ్ణి పట్టి శిక్షించమని నందరాజులు భటులనుపురమాయించారు. అయితే,అతడు వారికి పట్టుబడలేదు. నగరం నుంచి తప్పించుకున్నాడు.

ప్రపంచ విజేత కావాలన్న పట్టుదలతో గ్రీకుచక్రవర్తి అలెగ్జాండర్ భారతదేశం మీదికి దండయాత్ర సాగించిన రోజులవి. చంద్రగుప్తుడు నిర్భయంగా అలెగ్జాండర్ సమక్షానికివెళ్ళి, దండయాత్రను అధిక్షేపించి



అతనికి తారసపడ్డాడు. ఉభయుల లక్ష్యం ఒక్కటే – అది నందవంశ నిర్మూలనం! చంద్రగుప్తుడి ధైర్యసాహసాలకు చాణక్యుడి విద్యావివేకాలు దారి చూపాయి. అరణ్య మధ్యంలో రహస్యంగా సైనికులను సమీక రించి, వారికి తగిన శిక్షణనిచ్చారు. హఠాత్తుగా మగధ మీదికి దాడిజరిపి, అప్పటికే ప్రజాభి మానాన్ని కోల్పోయిన ధననందుణ్ణి రాజ్య భ్రష్టుణ్ణి చేసి సింహాసనాన్ని చేజిక్కించు కున్నారు. చాణక్యుడు ప్రధాన మంత్రిగా, చంద్రగుప్తుడు మగధ రాజ్యానికి రాజయ్యాడు. ఒకప్పుడు మగధ రాజ భవనంలో అవమా నానికిలోనైన తన తల్లి ముర పేరు మీదుగా మౌర్యవంశాన్ని స్థాపించి చంద్రగుప్తుడు కన్న తల్లి గౌరవం నిలబెట్టాడు!

ఆయన్ను పరిహసించాడు. అతన్ని పట్టు కోమని అలెగ్జాండర్, సైనికులను ఆజ్ఞాపిం చాడు. కాని గుర్రాలపై తనను వెంబడిం చినగ్రీకుసైనికులకు పట్టుబడకుండా పసి వాడైన చంద్రగుప్తుడు శరవేగంతో పరిగెత్తి పారిపోయాడు.

అటువంటి ఆవేశపరుడూ, దుడుకు స్వభావం కలవాడూ అయిన చంద్రగుప్తుడు మగధ సింహాసనాన్ని ఎలా అధిరోహించగలి గాడు? నిప్పుకు గాలి తోడైనట్టు, అతనికి చాణక్యుడనే పండితుడి సహాయం లభిం చింది. చాణక్యుడుకూడా ధననందుడి చేత అవమానించబడ్డాడు. నందవంశ నిర్మూల నమే తన జీవిత లక్ష్యంగా శపథం చేసి, చాణక్యుడు ఊరు వదిలిపెట్టాడు. ఆ సమ యంలోనే నవయువకుడైన చంద్రగుప్తుడు

అప్పటికే అలెగ్జాండర్ మరణించాడు. అయినా, పంజాబు వరకు గ్రీకుసామ్రాజ్యం విస్తరించి ఉన్నది. చంద్రగుప్తుడు తన సేన లను గ్రీకుసామ్రాజ్య సరిహద్దుల కేసి నడిపి, కొందరు గ్రీకు సామంతులను ఓడించి కొన్ని పరగణాలను ఆక్రమించుకున్నాడు. అప్పుడు ఆ ప్రాంతాన్ని అలెగ్జాండర్‌సేనా నాయకుడు సెల్యూకస్ పరిపాలిస్తున్నాడు. చంద్రగుప్తుడి దాడిని గురించి విన్న సెల్యూ కస్, గ్రీసు నుంచి వచ్చి, కోల్పోయిన ప్రాంతాలను తిరిగి రాబట్టుకోవడానికి చంద్ర గుప్తుడితో యుద్ధానికి దిగాడు. కాని మగధ సేనలు గ్రీకు సేనలను బలంగా ఎదుర్కో వడంతో, సెల్యూకస్ చంద్రగుప్తుడితో సంధి కుదుర్చు కున్నాడు. పైగా, ఆయన తన కుమార్తె ఎథీనాను చంద్రగుప్తుడికిచ్చి వివాహం జరిపించాడు!

ఆ తరవాత చంద్రగుప్తుడు మాళ్వ, ఘూర్జర, సౌరాష్ట్ర ప్రాంతాలను ఒక్కొక్కటిగా జయించి తన రాజ్య సరిహద్దులను విస్తరింపజేశాడు. ఆయన వివేకవంతుడూ, శక్తిసంపన్నుడూ అయిన గొప్ప రాజుగా కీర్తిగాంచాడు.

చంద్రగుప్తుడి అనంతరం, ఆయన కుమారుడు బిందుసారుడు మగధ సింహాసనాన్ని అధిష్ఠించాడు. తండ్రి దీక్షతో పెంచిన రాజ్య సంపదనూ, నెలకొల్పిన శాంతి భద్రతలనూ బిందుసారుడు దక్షతతో కాపాడాడు. ముఖ్య పరగణాలకు తక్షశిల, ఉజ్జయిని ప్రధాన నగరాలుగా వెలిశాయి.

బిందుసారుడు పరిపాలన సాగిస్తూన్న కాలంలో, ఒకనాడు ఒక పేద బ్రాహ్మడు, చాలా దూరంనుంచి రాజధానీ నగరమైన పాటలీపుత్రానికి వచ్చాడు. ఆ బ్రాహ్మడి వెంట ఒక అందమైన యువతి ఉన్నది. ఆమె అతని కూతురు. అతడు రాజభవనం ప్రధానద్వారం సమీపించి అక్కడున్న కాపలా భటులతో రాజుగారిని దర్శించాలన్నాడు.

కాపలాభటులు ఆ బ్రాహ్మణ్ణి ఎగా దిగా చూసి, "తమరు ఏ రాజ్యానికి మహారాజులు? ఈ మహారాణి ఎవరు? తమకు రాజుగారే స్వయంగా స్వాగతం పలకాలా?"అని పరిహసించారు.

బ్రాహ్మడు, "అయ్యలారా! నేను పల్లెటూరి వాణ్ణి, మహారాజుగారిని అగత్యం చూడాలి. దయతలచి సహాయం చేయండి. నాకు సాయపడ్డారంటే మునుముందు మీకు శుభం కలుగుతుంది!" అన్నాడు నెమ్మదిగా.

బ్రాహ్మడి మాటలు విని కాపలా భటులు ఆలోచనలో పడ్డారు. అతని పక్కన నిలబడి



ఉన్న యువతి శాంత గంభీరంగా ఉన్నది. కాపలాభటుల నాయకుడు బ్రాహ్మణ్ణి సమీపించి, "మీరు మహారాజును ఎందుకు దర్శించాలనుకుంటున్నారు?" అని అడిగాడు.

"అది ఇతరులతో చెప్పరాని పరమ రహస్యం! మహారాజుగారికి మాత్రమే విన్నవించగలను!" అన్నాడు బ్రాహ్మడు.

"రాజదర్శనం కావాలంటే మీ ఉద్దేశాన్ని, ముందుగా మంత్రిగారికైనా తెలియజేయాలి!" అన్నాడు భటుడు.

బ్రాహ్మడు ఏదో చెప్పబోతూండగా, లోపలి నుంచి గుర్రాల డెక్కల చప్పుడు వినిపించింది. ఎవరోగుర్రంమీద రాజభవనం నుంచి వస్తున్నారు.

"తప్పుకోండి! తప్పుకోండి!" అని భటులు హెచ్చరిస్తూ వచ్చారు. కాపలా భటుడొకడు

బ్రాహ్మణ్ణి పట్టి వెనక్కు తోశాడు. బ్రాహ్మడు వెనక ఉన్న కూతురి మీద పడడంతో, ఆమె నేలపై పడిపోయింది. అప్పటికే అక్కడికి గుర్రం మీద వచ్చిన బిందుసారుడు పగ్గాలు లాగి గుర్రాన్ని ఆపాడు. కాపలా భటులు రాజుకు నమస్కరించారు. ఆయన వారిని మందలించి, కిందపడివున్న వారిని చూశాడు. బ్రాహ్మడు మెల్లగా పైకి లేచి, వణుకుతూన్న కంఠస్వరంతో, "మహాప్రభూ! ఇందులో కాపలాభటుల తప్పేమీ లేదు. నేను, తమ దర్శనభాగ్యం ఎలా లభిస్తుందో అని వీళ్ళను అడుగుతున్నాను. ఇంతలో తమరు ఇటు వచ్చారు!" అన్నాడు.

"నువ్వు, నన్ను ఎందుకు చూడాలనుకున్నావు? ఆ అవసరం ఎందుకు కలిగింది?" అని అడిగాడు రాజు.

"అది రహస్యం. రహస్యంగానే చెప్పాలి!" అన్నాడు బ్రాహ్మడు వినయంగా.

ఈలోగా బ్రాహ్మడి కూతురు లేచి నిలబడి, రాజుకు నమస్కరించింది. చింపిరి జుట్టుతో, మట్టికొట్టుకుపోయిన బట్టలతో ఉన్నప్పటికీ ఆమె ముగ్ధమనోహరంగా కనిపించింది.రాజు తనను చూస్తూండగా ఆమె సిగ్గుతో తల దించుకున్నది. రాజు గుర్రం పైనుంచి దిగి, పగ్గాలను పక్కనున్న భటుడికి అందించి, బ్రాహ్మడికేసి రమ్మనట్టుచూసి, భవనం లోపలికి వెనుదిరిగాడు. కూతురితో సహా బ్రాహ్మడు రాజును అనుసరించాడు.రాజు వారిని, ఒక విశాలమైన గదిలోకి తీసుకు పోయి,తాను అక్కడున్న ఒక ఆసనంలో కూర్చుంటూ, "సరే, నువ్వు చెప్పాలనుకున్న దేదో ఇప్పుడు చెప్పు!" అన్నాడు.



బ్రాహ్మడు రాజుకు మళ్ళీ నమస్కరించి, "నా మాటలలో ఏదైనా అవివేకం ఉంటే ప్రభువులు నన్ను క్షమించాలి. నేను కేవలం విధికి దూతగా మాత్రమే వ్యవహరిస్తున్నాను. నా కుమార్తె శిశువుగా ఉన్నప్పుడు మా ఇంటికి ఒక సాధువు వచ్చాడు. ఆయన నా బిడ్డను దీవించి, పెరిగి పెద్దదై ఆమె మహారాణి అవుతుందని సెలవిచ్చి వెళ్ళాడు. ఒక నిరుపేద కూతురు రాజ్యానికి మహారాణి కావడమేమిటి? ఇంతకన్నా చోద్యమేముంటుందిలే అని నేను సాధువు మాటలను ఉదాసీనం చేశాను, ఆమె యుక్తవయస్కురాలయ్యాక, వివాహం చేయాలని వరుడి కోసం అన్వేషణ ప్రారంభించాను. ఆ సమయంలో ఆమె జాతకచక్రాన్ని పరిశీలించిన జ్యోతిష్కులు అమితాశ్చర్యం చెంది, ఆమె మహారాణి అవుతుందని ఘంటాపథంగా చెప్పారు!" అన్నాడు.



ఆ మాటలు విని రాజు ఆశ్చర్యంతో, ఆ యువతికేసి చూశాడు. ఆమె సిగ్గుతో నేల చూపులు చూడసాగింది.

బ్రాహ్మడు మళ్ళీ, "మహాప్రభూ! నాకు తెలిసిన మహారాజు మీరొక్కరే. అందుకే ఇక్కడికి వచ్చాను. నాకు తమ దర్శన భాగ్యం లభించడంలో కూడా విధి అదృశ్య హస్తం ఉన్నట్టుగానే నేను భావిస్తున్నాను. తమరే గనక, సమయానికి భవనం నుంచి రాలేదంటే నా గతి ఏమయ్యేదో నాకే తెలియదు. ఇప్పుడు నా కుమార్తె సుభద్రను తమకు సంతోషంగా సమర్పిస్తున్నాను. దయతో స్వీకరించండి!" అన్నాడు.

"ఇప్పటికే నాకు పలువురు రాణులున్నారు. నీ మాట ప్రకారం నీ కుమార్తెను వివాహమాడినా, ఆమె మహారాణి ఎలా కాగలుగుతుంది?" అని అడిగాడు రాజు కాస్త అనుమానంగా.

"అది నాకు తెలియదు. అంతా విధి ప్రకారం జరుగుతుంది!" అన్నాడు బ్రాహ్మడు.

రాజు చిరుదరహాసంతో, బ్రాహ్మణకుమారి వైపు చూసి, భటుడి ద్వారా రాజభవనంలోని ప్రధాన పరిచారికను పిలిపించి, "నేను తిరిగి వచ్చేవరకు ఈ యువతికి ఎటువంటి కొరతాలేకుండా తగినమర్యాదలు జరిపించు," అన్నాడు.

పరిచారిక ఆ యువతిని సమీపించింది. రాజు లేచి భవనం వెలుపలికి నడిచాడు.

అక్కడినుంచి బయలుదేరడానికి సిద్ధమవుతూన్న తండ్రిని సజలనయనాలతో చూస్తూ, "నాన్నా!" అని పిలిచింది సుభద్ర.

"నా కర్తవ్యం నెరవేర్చాను తల్లీ. ఇకపై నేను ఇక్కడ ఉండకూడదు. ఉన్నట్టయితే నలుగురూ పరిహసించగలరు. నీ తండ్రిగా నా బాధ్యతను తీర్చుకున్నాను. అంతే చాలు!" అన్నాడు బ్రాహ్మడు.

"నాన్నా! నన్ను వదిలి వెళ్ళకు!" అన్నది సుభద్ర బాధగా. "అదేంమాట తల్లీ! అయినా, నువ్వు ఇక్కడ ఒంటరిదానవు కావు. నీకు విధితోడు ఉంటుంది. నిన్ను ఇక్కడికి చేర్చిన విధే నిన్ను సర్వవేళలా కవచంలా రక్షిస్తుంది. బాధపడకు," అంటూ బ్రాహ్మడు కుమార్తెను ఓదార్చి, ఒకసారి ఆమెను తనివి తీరాచూసుకుని, పెల్లుబుకుతూన్న కన్నీళ్ళను తుడుచుకుంటూ భవనం వెలుపలికి నడవలేక నడిచి వెళ్ళాడు!

తండ్రి వెళ్ళిన వైపే చూస్తూ, మౌనంగా రోదిస్తూన్న సుభద్రను, పరిచారిక మెల్లగా

భవనం లోపలికి నడిపించింది. సుభద్రను చూడగానే రాజభవనంలో కలకలం బయలు దేరింది. రాణుల పరిచారికలు, సేవికలు తమలో తాము గుసగుసలాడుకోసాగారు.

"ఈమె అందం చూస్తూంటే పల్లెటూరి బ్రాహ్మడి కూతురు అని నమ్మ శక్యం కావడం లేదు. మారువేషంలో వున్న ఏ రాజకుమార్తె లాగానో ఉన్నది," అన్నది ఒక పరిచారిక సుభద్ర రూపం చూసి ఆశ్చర్యంతో.

"రాజుగారు ఈయువతిని వివాహమాడా రంటే మిగతా రాణులను మరిచి పోవడం ఖాయం," అన్నది మరొక పరిచారిక.

చాటునుంచి వారి మాటలు విన్న ముగ్గురు రాణులూ, అసూయతో నిట్టూర్చి తమ మందిరాలకు వెళ్ళిపోయారు.



ప్రధాన పరిచారిక సుభద్రకు ఒక విశాల మైన గది చూపించి,భోజనం పెట్టి, ధరించ డానికి నూతన వస్త్రాలు తెచ్చి ఇచ్చింది.

మరునాడు తెల్లవారగానే బిందుసారుడు రాజభవనం వదిలి పెట్టాడు. రాజ్య సరి హద్దు ప్రాంతాలలో కొందరు సామంతులు తిరుగుబాటు ప్రయత్నాలు చేస్తున్నారని తెలిసి, వారిని అణచడానికి సైన్యంతో వెళ్ళాడు. ఆయన వెళ్ళిన పని సాధించి తిరిగి రావడానికి రెండు నెలలు పట్టింది. రాజు తిరిగి వచ్చే వరకు ప్రధాన పరిచారిక సుభద్రకు అన్ని సౌకర్యాలూ సమకూర్చింది. కాని, తిరిగి వచ్చాక రాజు సుభద్రను గురించి మాట మాత్రమైనా అడగక పోయేసరికి, ఆయన ఆమెను పూర్తిగా మరిచి పోయాడని ప్రధాన పరిచారిక గ్రహించింది.

రాజు సుభద్రను పెళ్ళాడితే, ఆయనకు తమ పట్ల ఉన్న అనురాగం తరిగి పోగలదన్న అనుమానంతో రాణులు ముగ్గురూ రాజు ఆమెను మరిచిపోయేలా చేయాలని మాంత్రీ కుల ద్వారా రహస్యంగా మంత్ర తంత్రాలు ప్రయోగించ సాగారు.

రాణుల ప్రోద్బలంతో ప్రధాన పరిచారిక, సుభద్రను తేలికచేసి అవమానించసాగింది. ఆమెకు రాణులగోళ్ళు కత్తిరించడం వంటి పనులను పురమాయించింది. తమ పనులు సక్రమంగా చేయడంలేదని రాణులు సుభ ద్రను అవమానించి హింసించసాగారు. ఇంత జరిగినా సుభద్ర అన్నిటినీ మౌనంగా భరిం చిందే తప్ప, తన బాధలను ఎవరితోనూ నోరువిప్పి చెప్పుకోలేదు.ఇలా రెండేళ్ళు గడిచి పోయాయి.

ఒకనాడు సూర్యోదయంవేళ రాజు ఉద్యానవనంలో నడుస్తూండగా పచ్చికలోని ముల్లు ఆయన కాలికి గుచ్చుకున్నది. రాజు పక్కనే ఉన్న ఆసనంలో కూర్చుని, చేతులు చరిచాడు. భటుడు పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"కాలిలో ముల్లు గుచ్చుకున్నది. క్షురకుణ్ణి తీసుకురా!" అన్నాడు రాజు.

ఇలాంటి పనులు చేయడంలో క్షురకులు చాలా నేర్పరులు. కాని ఆ సమయంలో రాజభవనంలో అటువంటి వారెవ్వరూ కనిపించ లేదు. భటుడు ఇటూ అటూ చూసి ఎదురు పడినసుభద్రతో, "రాజుగారి పాదంలో ముల్లుగుచ్చుకున్నది. నువ్వు వెళ్ళి తియ్!" అన్నాడు.

సుభద్ర తడబడుతూ రాజును సమీపించింది. ఆయన పాదాలవద్ద నేల మీద కూర్చుని, పాదంలో గుచ్చుకున్న ముల్లును సుతారంగా తీసివేసింది.

"రాజభవనంలో లోగడ నిన్నెప్పుడూ చూసినట్టు లేదే!" అన్నాడు రాజు ఆమెతో.

సుభద్ర సమాధానం చెప్పలేదు. కాని ఆమె కళ్ళనుంచి బాష్పాలు పెల్లుబికాయి.

"ఇక్కడ నువ్వెంతకాలంగా ఉంటున్నావు?" అని అడిగాడు రాజు.

"మా నాన్న, నన్ను మీకు సమర్పించిన రోజునుంచిప్రభూ!" అన్నది సుభద్ర పొంగుతూన్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ.

రాజు ఆమెను మరొకసారి పరిశీలనగా చూశాడు. ఆమె తండ్రి ఆమెను తనకు సమర్పించిన విషయం ఆయన స్మృతి పథంలో తళుక్కున మెరిసింది. ఆ విషయాన్ని తనకు గుర్తుచేయని ప్రధాన పరిచారిక మీద రాజుకు మొదట ఆగ్రహం కలిగింది. కొంతసేపటికి తన మతిమరుపుకు తన మీదేకోపం వచ్చింది. తన పొరబాటుకు ఎవరినినిందించి ఏంలాభంఅనుకుని, సుభద్రతో, "సరే, జరిగిన జాప్యమేదో జరిగిపోయింది. నీకు జరిగిన అన్యాయాన్ని వెంటనే రూపుమాపాలి. కాబట్టి ఈ రోజు సూర్యాస్తమయంలోగా నిన్ను వివాహమాడతాను!" అన్నాడు.

వెంటనే ఆయన మంత్రులనూ, పురోహితులనూ పిలిపించి, విషయం తెలియజేసి,వివాహానికి కావలసిన ఏర్పాట్లుచేయమని ఆజ్ఞాపించాడు. — (ఇంకావుంది)





# సుందుడు-ఉపసుందుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు పడుతున్న ఇన్ని శ్రమలకు మూలకారణం ఏమిటో నాకు తెలియడం లేదు. ఈ లోకం చాలా చిత్రమైనది. గొప్ప యోగవిద్యాధురంధరులే కాక, కనుకట్టు, గజకర్ణ, గోకర్ణ, టక్కు టమార విద్యలు నేర్చిన తాంత్రికులుకూడా, కొన్ని సందర్భాల్లో అపూర్వశక్తులు ప్రదర్శించగలరు. అయితే, అలాంటి వారిలో కొందరు ఒక్కొక్కప్పుడు తమ తమ సమస్యలు పరిష్కరించుకునేందుకు, శక్తిమంతుడైన ఏ రాజునో ఆశ్రయిస్తారు. ఇది వింత విషయం కాదా? ఒకవేళ, నిన్ను గురించిన నా అనుమానమే నిజమైతే–తన సమస్య పరష్కారానికి నిన్నాశ్రయించిన వాడు, యోగియో లేక తాంత్రిక

## బేతాళ కథలు



విద్యలు నేర్చినవాడో గ్రహించావా? యోగి అవసరపడినప్పుడు ప్రజలకు సాయంచేస్తూ, ముక్తి పొంద కోరతాడు. తాంత్రికుడలా కాక కీర్తి, అధికార వ్యామోహంతో ప్రజలను మభ్యపెడుతూంటాడు. ఇందుకు ఉదాహరణగా సుందుడు అనేవాడి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు మగధ దేశంలోని ధర్మపురిగ్రామంలో సుందుడు, ఉపసుందుడు అనేవాళ్ళు ఇరుగు పొరుగున వుండేవారు. సుందుడు ఆస్తిపరుడు, నా అన్నవాళ్ళులేరు. తనకున్నంతలో పదిమందికీ సాయపడుతూ, మంచివాడన్న పేరుతెచ్చుకున్నాడు.

ఉపసుందుడిందుకు పూర్తిగా విరుద్ధం. అతడిది పెద్ద కుటుంబం. వ్యసనాల పేరు చెప్పి దుబారా ఖర్చులు చేసేవాడు. అందరితో గిల్లికజ్జాలు పెట్టుకునేవాడు. తను నష్టపోయి అయినాసరే, ఎదుటి వాడికి లాభం రాకుండా చేయాలన్నదే అతడి ఆలోచన. పొరుగువాడు పచ్చగా వుంటే ఓర్వలేడని అందరూ అతణ్ణి దుష్టుడనీ, అసూయాపరుడనీ చెప్పుకునే వారు.

తనకు చెడ్డపేరున్నదని ఉపసుందుడికి తెలుసు.కానీ అందుక్కారణం తన చెడ్డగుణాలని అతడొప్పుకోడు. తన పొరుగున వున్న సుందుడు తనకు చెడ్డపేరు తేవాలని సంకల్పించాడనీ, అందుకోసం కావాలనే మంచి పనులు చేస్తున్నాడనీ అతడు చాలామందితో అన్నాడు.

"నా కుటుంబం పెద్దది. అందువల్ల నాకెన్నో చిక్కు సమస్యలు వస్తూంటాయి. అవి తీర్చే దారిలేకనే వ్యసనపరుణ్ణయ్యాను. వ్యసనాల పేరుచెప్పి కాసేపైనా, నా సమస్యలు మరిచిపోదామని నా ఉద్దేశ్యం.నాకు దానాలు చేయాలని వుంటుంది. డబ్బు లేదు. అందరితో మంచిగా వుండాలని ఉంటుంది.కానీ మనసంతా చీకాకుగా వుండి గిల్లికజ్జాలు పెట్టుకుంటాను. ఇవన్నీ సుందుడికి తెలుసు! అయినా నాకు సాయం చేయడు. నాకష్టాలు తీరిపోతే నేను మంచివాణ్ణయిపోతాను. నేను మంచివాడైతే సుందుడికి నష్టం," అని ఉపసుందుడొకసారి ధర్మపురి గ్రామాధికారితో అన్నాడు.

గ్రామాధికారి ఆశ్చర్యపడి, "నీ మంచితనం వల్ల సుందుడికేం నష్టం?" అని అడిగాడు.

"బొగ్గు పక్కన బూడిద కూడా వెన్నెలలా మెరుస్తుంది. మాను లేని చోట ఆముదం

చెట్టు మహావృక్షం. పండితులు లేని చోట అక్షరజ్ఞానమున్నవాడే కాళిదాసు. లేకుంటే సుందుడు చేస్తున్న మంచి ఏముంది? నా బోటివాడు పొరుగున వుండడం వల్ల, వాడే పని చేసినా నాతో పోలిక వచ్చి పొగడ్తలకర్హ మవుతున్నది. కాదనగలరా?" అన్నాడు ఉప సుందుడు.

ఈ జవాబు గ్రామాధికారికి సబబుగా తోచింది. ఈ మాటలు ఆ నోటా ఈ నోటా నలిగి, చివరకు సుందుడు, ఉపసుందుణ్ణి బొత్తిగా ఆదుకోవడం లేదని ప్రచారమైంది. ఆ ప్రచారం ఒకరోజున సుందుణ్ణీ చేరింది.

సుందుడుఆలస్యంచేయకుండా గ్రామాధి కారి వద్దకు వెళ్ళాడు. ఊరి పెద్దల్నీ, ఉపసుం దుణ్ణీ పిలిపించమన్నాడు. అంతా వచ్చాక అతడు ఉపసుందుడితో, "నీ ఆదాయ మెంత?" అని అడిగాడు. నెలకు నూరు వరహాలన్నాడు ఉపసుందుడు. వ్యయమెంతంటే, నెలకు మూడువందల వరహాలన్నాడు. అప్పులున్నాయా అంటే, రెండువేల వరహాలుందన్నాడు.

అప్పుడు సుందుడు, గ్రామాధికారితో, "అయ్యా! ఉపసుందుడి అప్పు తీర్చేస్తాను. నాది నెలకు వెయ్యి వరహాలు వచ్చే ఆస్తి. అది మీకు అప్పగిస్తాను. అందులోంచి ప్రతి నెలా అయిదు వందల వరహాలు ఉపసుందుడికిస్తూండండి. ఇక మీదట ఉపసుందుడు వ్యసనాలు విడిచి పెట్టాలి. గిల్లికజ్జాలుమానాలి. తనవద్ద అదనంగా వున్నడబ్బుతో పరోపకారం చెయ్యాలి. ఇంతే నా షరతులు," అన్నాడు.

గ్రామాధికారి తెల్లబోయి, "ఏవో గాలి కబుర్లు విని, నీవిలా ఆవేశపడ్డం మంచిది కాదు," అంటూ ఏదో చెప్పబోయాడు.




సుందుడాయనను మధ్యలో ఆపి, "నేను ఉపసుందుడికి చాలాసార్లు సాయపడ్డాను. అయినా, నా మీద దుష్ప్రచారం చేస్తే అంతా ఉపసుందుడినే నమ్మారు. ఉపసుం దుడు దుష్టుడనడంలో సందేహం లేదు. మన సమాజంలో దుష్టుడి మాటకు విలు వెక్కువున్న విషయంలోనూ సందేహంలేదు. ఉపసుందుడు తను దుష్టుడినని స్వయంగా ఒప్పుకున్నాడు. అందుకు కారణాలు చెప్పాడు. వాడు మంచివాడయ్యే అవకాశం నా ద్వారా లభిస్తే నాకు సంతోషం. అందుకే ఈ పని చేస్తున్నాను," అన్నాడు.

గ్రామాధికారి, సుందుణ్ణి మెచ్చుకుని, "ఉపసుందుడి ఆరోపణలకు చక్కని సమా ధానమిచ్చావు. ఇక మీదట అతడు బుద్ధిగా వుండకపోతే, అతడి బండారం బయట



పడుతుంది. నీ బుద్ధికుశలత మెచ్చుకుంటు న్నాను. కానీ నీ ఆస్తిలో ఇంకా నెలకు అయిదువందల వరహాల వాటా, నా వద్ద వుండిపోతుంది గదా! దాంతో నీవిక్కడే వుండి సుఖంగా జీవించవచ్చు కదా!" అన్నాడు.

దానికి సుందుడు, "నేను పొరుగున వుంటే, ఉపసుందుడికీ నాకూ పోలిక వస్తుంది. నాతో అతడు సరిపోలడు. అందువల్ల అతడికి రావలసిన మంచిపేరు రాదు. అందుకే నేను ఈ గ్రామం విడిచిపోతున్నాను. అదీ కాక, నాకు ఐహిక సుఖాల మీద ఆసక్తి లేదు: అరణ్యాలకు వెళ్ళి మహర్షుల నాశ్ర యించి జ్ఞాన సముపార్జన చేద్దామను కుంటున్నాను. నా మిగతా ఆస్తిని గ్రామస్థుల మేలుకు ఉపయోగించండి. ఇది తిరుగులేని నా నిర్ణయం!" అని అప్పటికప్పుడు అవసరమైన పత్రాలు తయారు చేయించి, గ్రామం విడిచి పెట్టాడు.

ఆ తర్వాత సుందుడు ఒక కీకారణ్యం ప్రవేశించి, ఒక మహర్షి నాశ్రయించాడు. ఆయన సుందుడిని కొన్ని ప్రశ్నలు అడిగాక, "నాయనా! మేధావి అయిన మనుష్యుడు ఎన్నుకోవలసినవి రెండే రెండు మార్గాలు. ఒకటి తపస్సు చేసి ముక్తిని పొందడం, రెండవది యోగవిద్య ద్వారా జ్ఞాన సముపార్జన కావించడం. నీలో జ్ఞానతృష్ణ అమితంగా ఉన్నది. నువ్వు యోగివై ప్రజాహితం కొనసాగించు," అంటూ అతణ్ణితన శిష్యుడుగాచేర్చుకున్నాడు. అలా కొంతకాలం గడిచింది.

అప్పుడు మగధదేశాన్ని మహాగుప్తుడనే రాజుపరిపాలిస్తున్నాడు.రెండు సంవత్సరాలుగా వానలు లేక రాజ్యంలో నీటికీ,తిండికీ కొరత ఏర్పడింది. ఆ సంవత్సరం కూడా వానలు పడే సూచనలు కానరాక రాజు ఖిన్నుడై మంత్రులను సమావేశ పరిచాడు. ఎవరికీ ఏమీ పాలుపోని పరిస్థితి!

ఆ సమయంలో సుందుడక్కడికి వచ్చి, రాజదర్శనం చేసుకొని, ఆయనతో, "మహా రాజా! నువ్వు తప్ప పరిష్కరించలేని సమస్య ఒకటి వచ్చిపడింది. అది నువ్వు పరిష్కరిస్తే, నేను నీకు నా శక్తి కొద్దీ, సాయపడగలను," అన్నాడు.

వేషభాషలనూ, ముఖతేజస్సునూ బట్టి మహాగుప్తుడు,సుందుడినొక యోగిగాభావించి, "మహానుభావా!మీ సమస్య చెప్పండి. పరిష్క రిస్తాను.నా సమస్యను తమరు పరిష్కరించ లేరు. కాబట్టి మీ సాయంనాకవసరం లేదు," అన్నాడు.

సుందుడు గంభీరంగా, "ఇచ్చిపుచ్చుకోవడం మానవ ధర్మం. నీ సమస్య ఏమిటో చెప్పు. అది తప్పక నేను పరిష్కరిస్తాను," అన్నాడు.

మహాగుప్తుడు దేశంలో వానలు లేకపోవడం గురించి చెప్పాడు.

దీనికి సుందుడు నవ్వి, "ఇది నాకు చిటికెల మీద పని. ప్రకృతి శక్తులు కొన్ని సూత్రాల ఆధారంగా పనిచేస్తాయి. వాతావరణంలో అనుకూలత లోపించి మన దేశంలో వానలు లేవు. కొన్ని మంత్ర శబ్దాలను ఉచ్చరిస్తే, వాటి ప్రభావంతో వాతావరణంలో వర్షానుకూలత ఏర్పడుతుంది. అందుకు అనువైన స్థలం చూడాలి. అంతే!" అన్నాడు.

మహాగుప్తుడాశ్చర్యపడి, "నా రాజ్యంలో వానలు కురిపిస్తే తమకు కనకాభిషేకం చేయించగలను," అన్నాడు.

సుందుడు దానికి బదులివ్వకుండా, కాసేపు కనులు మూసుకుని, "రథం సిద్ధం చేయించు. శివపుత్ర గ్రామం శబ్దయజ్ఞానికి అనుకూల ప్రాంతం," అన్నాడు.

రథం సిద్ధమైంది. జోడుగుర్రాల ఆరథంలో సుందుడు, మహాగుప్తుడు మాత్రం కూర్చున్నారు. సుందుడి ఆదేశం ప్రకారం రాజు నిరాయుధుడుగా వున్నాడు. ముందు సారథి కూర్చుని గుర్రాలను అదిలించాడు. రథం బయలుదేరింది.

ప్రయాణం సగం దూరం వెళ్ళేసరికి, ఉన్నట్టుండి గుర్రాలు పెద్దగా సకిలించి ఆగిపోయాయి. సారథి కంగారుగా, "ప్రభూ! పులుల మంద ఒకటి బాటకు అడ్డంగా వున్నది," అన్నాడు.

సుందుడు, మహాగుప్తుడు అటుకేసి చూశారు. పెద్దా, చిన్నా కలిసి సుమారు పన్నెండు పులులు బాట మీద కాస్త దూరంలో వున్నాయి.





జలాశయాలు ఎండిపోవడం వల్ల నీటిని వెతుక్కుంటూ, అవి అక్కడికి వచ్చివుండవచ్చు. తమను సమీపిస్తున్న జోడు గుర్రాలు, ముగ్గురు మనుష్యులు- వాటిలో ఉత్సాహాన్ని పుట్టించినై. సమయానికి ఆయుధాలు లేవని మహాగుప్తుడు కలవరపడ్డాడు.

సుందుడు రథం దిగి, మంత్రం జపిస్తూ ముందుకు వెళ్ళి పులులను సమీపించాడు. మహాగుప్తుడు నిర్విణ్ణుడై చూస్తూండగా, పులులన్నీ ఒకదానితర్వాతఒకటిగా, అతడి పాదాల ముందు మోకరిల్లి, అక్కడి నుంచి సమీపారణ్యంలోకి వెళ్ళిపోయాయి.

అప్పుడు రథం కదిలి సుందుణ్ణి సమీపించింది. సుందుడు రథం ఎక్కి, "క్రూర మృగాలు కొన్ని సూత్రాలననుసరించి జీవితాన్ని గడుపుతాయి. శబ్దజాలంతో వాటిని అదుపు చేయడం యోగికి సాధ్యమవుతుంది," అని రాజుకు చెప్పాడు.

ఆ తర్వాత కొద్ది సేపటికి రథం శివపుత్ర గ్రామం చేరుకున్నది. ఆసమయానికి గ్రామ పొలిమేరలో గ్రామస్థులుకొందరు హడావిడి పడుతూ కనిపించారు. సుందుడు వారిని విషయమేమిటని అడిగాడు.

ఒక వృద్ధుడు, సుందుడి వంక ఆశ్చర్యంగా చూసి, "నువ్వుకానీ యోగివి కాదు గదా?" అన్నాడు.

సుందుడు తను యోగినని చెప్పాడు.

అప్పుడా వృద్ధుడు, "యోగి ఒకరు మా గ్రామం వస్తాడనీ, శబ్దయజ్ఞం చేసి వానలు కురిపిస్తాడనీ గ్రామదేవత గ్రామాధికారి కలలో కనిపించి చెప్పింది. శబ్దయజ్ఞం వల్ల దేశంలో వానలు పడతాయి కానీ, మా గ్రామంలో భూకంపం వస్తుందట. భూకంపం రాకుండా గ్రామాన్ని కాపాడాలంటే – అదిగో ఆ మర్రి చెట్టు మొదల్లో వున్న రాతిని ఆరడుగుల ఎత్తుకు లేపాలట. గ్రామం వాళ్ళు ఇందాకటి నుంచీ ప్రయత్నిస్తున్నారు. ఆ రాయి అంగుళం మేర కూడా కదల్లేదు," అన్నాడు.

అప్పుడు మహాగుప్తుడు ముందుకువెళ్ళి ఆరాతిని చూశాడు. అది ఎంతో పెద్దదిగానూ, బరువుగానూ వున్నది. మహాబలవంతులెవరైనా దాన్ని కాస్తమేర కదపగలరేమో కానీ ఆరడుగుల ఎత్తుకు లేపడం అసాధ్యం.

ఏం చేయాలా అని రాజు ఆలోచిస్తూండగా, సుందుడాయనను సమీపించి, "మహారాజా! అన్ని పనులూ బలంతో సమకూరవు. జ్ఞానశక్తిని ఉపయోగిస్తే కొండలను పిండి చేయవచ్చు. అణువులోంచి బ్రహ్మాండాన్ని

సృష్టించవచ్చు. నేను జ్ఞానశక్తితో ఈ రాతిని పైకిలేపుతాను, చూస్తూండు," అంటూ కొన్ని మంత్రాలనుచ్చరించాడు.

అమరుక్షణం రాయి గాల్లోకి లేచి, సరిగ్గా ఆరడుగుల ఎత్తుకుపోయి, అక్కడ ఆగింది. గ్రామస్థులందరూ ఆనందంతో జయజయ ధ్వానాలు చేశారు.

ఆ తరవాత సుందుడు శబ్దయజ్ఞం చేశాడు. అది ముగియగానే, ఆకాశంలో ఒక మూల నల్లటి మబ్బుతునక కనబడింది. అది క్రమంగా పెద్దదయి, ఉన్నట్టుండి చల్లటి గాలి వీచింది. వానచినుకులు ప్రారంభ మయ్యాయి. శివపుత్ర గ్రామంలోనే కాదు, మగధదేశమంతటా పౌరుల మనసు ఉప్పొంగి పోయేటంతగా వానలు పడ్డాయి.

ఇది జరిగాక మహాగుప్తుడు కలవర పడుతూ,సుందుడితో, "మహానుభావా! తమరు సర్వశక్తిమంతులు.అతారపురుషుడిలా నా రాజ్యంలో అడుగుపెట్టి, నా పౌరులకష్టాలు తీర్చారు. నేను సామాన్యుణ్ణి! తమవల్ల కాని సమస్యను నేను పరిష్కరించగలనా? అన్న బెంగ నన్నిప్పుడు వేధిస్తున్నది," అన్నాడు.

సుందుడు చిన్నగా నవ్వి, రాజుకు ఉప సుందుడి కథ చెప్పి,"వాడింకా నన్ను విడిచి పెట్టలేదు. యోగినై నేను అద్భుతశక్తులు పొందానని వాడికి తెలిసింది. వాడు అరణ్యం లోని నా ఆశ్రమానికి వచ్చి, నన్ను యోగవిద్య, నేర్పమని వేధిస్తున్నాడు. యోగవిద్యకు సంబం ధించిన ఎన్నో రహస్యాలను నేను, నా ఆశ్ర మంలో భద్రపరిచాను.ఇంకా ఎన్నో రహస్యాలు నేను తెలుసుకోవలసివుంది. ఉపసుందుడు నన్ను చీకాకు పరచకుండా, నా ఆశ్రమానికి రక్షణ కల్పించవలసిందని కోరడానికే, నేను నీ దగ్గరకు వచ్చాను," అన్నాడు.

దీనికి మహాగుప్తుడెంతో ఆశ్చర్యపడి, "క్రూరమృగాలను శాసించ గలరు. బండ



రాళ్ళను గాలిలో తేల్చగలరు. ప్రకృతి శక్తుల్ని ప్రేరేపించగలరు. అటువంటి తమకు, ఉప సుందుడివంటి సామాన్యుడి విషయంలో, నా సాయం కావాలా?" అన్నాడు.

అందుకు సుందుడు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా ఉండిపోయి, తరవాత రాజుకేసి గంభీరంగా చూస్తూ, "రాజా, దేశానికి రాజుండగా దుర్మార్గులను శిక్షించడం నాకు తగని పని!" అన్నాడు.

మహాగుప్తుడు మారుపలకకుండా, అర ణ్యంలోని సుందుడి ఆశ్రమానికి తగిన కట్టు దిట్టాలు చేసి, ఉపసుందుణ్ణి ఆ ప్రాంతాలకు వెళ్ళకుండా శాసించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సుందుడు మంత్రోచ్చారణతో క్రూరమృగాలను దారి మళ్ళించడం, పెద్దరాతిని గాలిలోకి లేపడం, అలాగే శబ్దయజ్ఞంతో వానలు కురిపిం చడం– ఇవన్నీ గొప్ప యోగశక్తులు కలవాళ్ళు చేయగలిగినవే; కాదనలేం. అయితే, నన్నొక సందేహం బాధిస్తున్నది. ఇన్ని మహత్తరశక్తులు కలవాడు, ఒక దుర్మార్గుణ్ణి శిక్షించలేక, రాజు సాయం కోరడం వింతగా లేదా? ఒక వేళ, సుందుడు ప్రదర్శించినవన్నీ కనుకట్టు లాంటి క్షుద్రతాంత్రిక శక్తులు మాత్రమేనా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మనిషికి బుద్ధి, మెదడు, ఆలోచనాశక్తి మాట్లాడే నేర్పు ఇచ్చాడు భగవంతుడు. ఇవి కొన్ని సూత్రాలపై ఆధార పడి పనిచేస్తే, వాడు సన్మార్గుడు. దుర్మార్గుడి ప్రవర్తన ఏ సూత్రాలపైనా ఆధారపడివుండదు. జ్ఞానం, విజ్ఞానం, యోగవిద్య అటువంటి వారిపై ప్రభావం చూపించవు. సుందుడు తన యోగవిద్యతో ఉపసుందుణ్ణి శిక్షించ గలడేమో కానీ బుద్ధిని మార్చలేడు. పైగా,ఎట్టి పరిస్థితుల్లోనూ యోగి అయినవాడు, తన స్వార్థం కోసం ఎదుటి వాణ్ణి తనకై తాను శిక్షించకూడదు. అందువల్ల, అతడి యోగ విద్యాశక్తులు మొక్కపోయే ప్రమాదం ఉన్నది. ఆ కారణం చేతనే సుందుడు,రాజు సాయం కోరాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]






## సముద్ర తీర ప్రయాణాలు -15

# మన్నారు సింధుశాఖ ఉత్తరప్రాంతం

రచన: మీరానాయర్ ◆ చిత్రాలు : గోపకుమార్

కన్యాకుమారి నుంచి తీరం గుండా పైకి పయనించామంటే మన్నారు సింధుశాఖలో ప్రవేశిస్తాము.

మన్నారు సింధుశాఖ ముఖద్వారంలో, ప్రధాన భూమిమీద తీరపట్టణమైన తిరుచ్చెందూర్ ఉన్నది. ఇక్కడ సముద్రానికి అభిముఖంగా బ్రహ్మాండమైన సుబ్రహ్మణ్యస్వామి దేవాలయం ఉన్నది. సుబ్రహ్మణ్యస్వామి వెలసిన ప్రధానమైన ఆరు పుణ్యక్షేత్రాలలో ఇది ఒకటి. మిగిలిన ఐదుఆలయాలూ కొండలమీద ఉన్నాయి. ఈ ఆలయం మాత్రం సమతల ప్రదేశంలో ఉన్నది. దాదాపు వెయ్యి సంవత్సరాలకు పూర్వం నిర్మించబడిన ప్రాచీన ఆలయ ప్రాంగణంలోనే, మూడుశతాబ్దాల క్రితం తొమ్మిది అంతస్తుల గాలి గోపురం నిర్మించబడింది. భక్తులు కావళ్ళతో గుడికి వచ్చి, భగవంతుడికి మొక్కుబడులు చెల్లిస్తూ ఉంటారు.

తిరుచ్చెందూరుకు కొన్ని కి.మీ. ఉత్తరంగా తూత్తుక్కుడి (టుటికోరిన్) ఉన్నది. 1974 జూలై 11వ తేదీ కేంద్రప్రభుత్వం ఇక్కడి రేవును మనదేశంలోని 10వ ముఖ్యమైన ఓడరేవుగా ప్రకటించింది. ఆ కారణంగా తమిళనాడు మనదేశంలో రెండుముఖ్యమైన ఓడరేవులు గల ఏకైక రాష్ట్రం అనే ప్రత్యేకతను సంతరించుకున్నది. ఇక్కడి ఓడరేవు మానవనిర్మితమైనది. అన్ని వాతావరణాలలోనూ ఉపయోగపడుతుంది. దీనికి ఉత్తరంగానూ, దక్షిణంగానూ సముద్రంలో దృఢమైన రెండు అడ్డుగోడలు ఉన్నాయి. సముద్రపు అలల తాకిడి నుంచి రేవును రక్షించడానికి ఈ అడ్డుగోడలనునిర్మించారు. ఉత్తరపు గోడ 4096 మీ. పొడవు గలది. ప్రపంచంలో రెండవ పొడవైన గోడ ఇది!

ప్రాచీన కాలం నుంచే మనదేశం ముత్యాలకు పేరుగాంచింది. క్రీ.శ. 2వ శతాబ్దంలో మనదేశం నుంచి రోము వంటి దూరదేశాలకు ఎగుమతి చేయబడిన ముత్యాలు చాలావరకు మన్నారు సింధుశాఖలో


శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవాలయం



లభించినవే. తూత్తుక్కుడి ఇవాళ కూడా ముత్యాల వర్తక కేంద్రంగా ఉంటున్నది. ఉప్పు కర్మాగారాలకూ, ఎరువుల కర్మాగారాలకూ, విద్యుత్ కేంద్రానికీ ఇది మరింత పేరుగాంచింది.

హిందువులు పరమ పవిత్రంగా భావించే రామేశ్వర ద్వీపక్షేత్రం మన్నారు సింధుశాఖకు ఉత్తరంగా ఉన్నది. హిందువులు పవిత్రంగా భావించే నాలుగు దివ్యక్షేత్రాలలో ఇది ఒకటి. (బదరీనాథ్, ద్వారక, జగన్నాథ పూరీ మిగతా మూడుక్షేత్రాలు). భక్తులైన హిందువులు తమ జీవిత కాలంలో కనీసం ఒక్కసారైనా రామేశ్వర క్షేత్రాన్ని దర్శించాలని కాంక్షిస్తారు. రామాయణగాథలోని కొన్ని ముఖ్యమైన ఘట్టాలతో ఈ దీవికి సంబంధం ఉన్నదని చెబుతారు.

శ్రీరాముడి పేరు మీదుగానే దీనికి రామేశ్వరమనే పేరు వచ్చింది. బ్రాహ్మణ వంశానికి చెందిన రావణుణ్ణి వధించిన పాపం తొలగించుకోవడానికి శ్రీరాముడు ఇక్కడ శివపూజ చేశాడని చెబుతారు. శ్రీరాముడు కైలాసం నుంచి శివలింగాన్ని తీసుకురమ్మని హనుమంతుణ్ణి కోరాడు. హనుమంతుడు కైలాసానికి వెళ్ళాడుగాని, ఎంతకూ తిరిగిరాలేదు. పూజా సమయం ఆసన్నమయింది. కాని హనుమంతుడి జాడ కనిపించ లేదు. ఇక వేచి లాభం లేదు. పుణ్య ఘడియలు పూర్తయ్యేలోగా ఇసుకతో శివలింగం చేసి ప్రతిష్ఠించి పూజించవచ్చని సీత ఇచ్చిన సలహా ప్రకారం శ్రీరాముడు ఇసుకలింగాన్ని ప్రతిష్ఠించి పూజించాడు.

ఆ తరవాత వచ్చిన హనుమంతుడు విషయం తెలిసి ఎంతో బాధపడ్డాడు. అతని బాధను పోగొట్టడానికి శ్రీరాముడు తానుప్రతిష్ఠించిన ఇసుక లింగాన్ని తొలగించి ఆస్థానంలో హనుమంతుడు తెచ్చిన శివలింగాన్ని ప్రతిష్ఠించమని హనుమంతుణ్ణి కోరాడు. హనుమంతుడు దానిని పైకెత్త బోయాడు. వీలుకాలేదు. ఆఖరికి ధానికి తన వాలాన్ని చుట్టి లాగాడు. కాని అది ఏమాత్రం కదలలేదు. ఆ పిమ్మట శ్రీరాముడు హనుమంతుణ్ణి ఓదార్చి, అతడు తెచ్చిన లింగాన్ని పక్కనే ప్రతిష్ఠించమని చెప్పి, దానికే తొలిపూజలు జరుగుతాయని వరమిచ్చాడు.



శివలింగాన్ని పెకలించడానికి ప్రయత్నిస్తున్న హనుమంతుడు



రామేశ్వర దేవాలయం

ఈనాటికీ ఇక్కడికి వచ్చే భక్తులు మొదట హనుమంతుడు ప్రతిష్ఠించిన 'కాశీవిశ్వనాధరామనాధస్వామిలింగాన్ని' పూజించిన తరవాతే 'రామలింగాన్ని' పూజిస్తారు.

శ్రీరాముడు శివపూజ చేశాడని విశ్వసింపబడే చోట, సేతుపతి రాజవంశానికి చెందిన ఉదయనుడనే రాజు 15వ శతాబ్దంలో బ్రహ్మాండమైన ఆలయం నిర్మించాడు. ఈ దేవాలయంలో అపురూప శిల్పాలతో అలరారే వెయ్యి స్తంభాలుగల 1200 అడుగుల పొడవైన మంటపంఉన్నది. ఇదే మన దేశంలోని అతి పెద్ద ఆలయమంటపం!

ఈ ఆలయాన్ని శిక్కుల పదవ గురువు గురుగోవింద్‌సింగ్ దర్శించాడు. అందుకే దీనిని హిందువులతోపాటు శిక్కులు కూడా పవిత్ర క్షేత్రంగా భావిస్తారు.



బ్రహ్మాండమైన ఆలయ మంటపం

రామేశ్వరం సముద్రజీవశాస్త్రవేత్తలను విశేషంగా ఆకర్షిస్తున్నది. ఈ దీవి పరిసరాలలో పగడాల మధ్య నివసించేవింత ప్రాణులను పరిశీలించి అధ్యయనం చేయడానికి విజ్ఞానశాస్త్ర పరిశోధకులు వస్తూవుంటారు.

రామేశ్వరానికిఆగ్నేయదిశగా ఉన్న ధనుష్కోటికి శ్రీలంక చాలా సమీపంలో ఉన్నది.

ధనుష్కోటి అంటే 'రామధనువు' అని అర్థం. ఇక్కడి తీరం ధనువు ఆకారంలో వంపుగా ఉండడం వల్ల దీనికి పేరు వచ్చింది. ఇక్కడున్న కోదండరామస్వామి ఆలయంలో సీతారామలక్ష్మణ హనుమంతుల విగ్రహాలతో పాటు రావణ సోదరుడైన విభీషణుడి విగ్రహం కూడా ఉన్నది. విభీషణుడు శ్రీరాముడి శరణుజొచ్చిన స్థలంలోనే ఈ ఆలయం వెలసిందని చెబుతారు.

రామేశ్వరందీవికి సమీపంలో చాలా ఇసుకమేటలు ఉన్నాయి. శ్రీరాముడు లంకకు నిర్మించిన వారధిగా





ధనుష్కోటిలోని ఇసుకదిబ్బలు. 'రావణుడి కోర మీసాలు' అనిచెప్పుకునే ఒకరకం గడ్డిపోచలు. ఇవే ఇసుకను నిలకడగా ఉంచుతున్నాయి.



శివపార్వతుల ఆశీస్సులు పొందుతున్న అగస్త్యముని

వీటిని చెబుతారు. శ్రీలంకకు భారత భూభాగంతో ఒకప్పుడు సంబంధం ఉండేదనడాన్ని ఇవి సూచిస్తాయని భూతత్వ శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు. దాదాపు 30 మీ. పొడవైన ఈ ఇసుకమేటలు నౌకాయానానికి పెద్ద అవరోధంగా ఉంటున్నాయి.

రామేశ్వరం నుంచి, పాక్ జలసంధిని దాటి వెళ్ళామంటే కోడికర్రై చేరుకుంటాం. కోడికర్రైని సమీపిస్తున్నప్పుడే మనకు ఆకాశంలో ఎగిరే ఫ్లెమింగో పక్షులు కనిపిస్తాయి. ఇక్కడున్న పక్షుల శరణాలయంలో రకరకాల పక్షులు ఉన్నాయి.

కోడికర్రై సమీపంలో వేదారణ్యం అనే తీరపట్టణం ఉన్నది. ఉత్తరోత్తరా స్వతంత్ర భారతదేశంలో గవర్నర్ జనరల్ పదవిని నిర్వహించిన సి.రాజగోపాలాచారి, స్వతంత్ర పోరాట సమయంలో ఇక్కడ ఉప్పు సత్యాగ్రహం జరపడంతో వేదారణ్యం రాజకీయ ప్రాముఖ్యతను సంతరించుకున్నది.

• వేదారణ్యంలోని శివాలయం చాలా ప్రసిద్ధి గాంచింది. ఇక్కడి శివపార్వతీ విగ్రహాలను వివాహ వస్త్రాలతో అలంకరిస్తారు. అగస్త్యమునికి, పరమశివుడు ఇక్కడ పార్వతీదేవి సమేతంగా కైలాసంలో ఆమెను వివాహమాడిన వైభవంతో దర్శనమిచ్చాడని స్థలపురాణం చెబుతున్నది. అందువల్లే వేదారణ్యానికి దక్షిణ కైలాసం అనే మరొక పేరు కూడా వచ్చింది!

కోడికర్రై





# రాక్షసుడి శపథం

చంద్రశిలా రాజ్యం రాజు విక్రమసేనుడుభోగ లాలసుడు. పరిపాలనా విషయాలు పట్టించు కునేవాడు కాదు. అందువలన, పరిపాలనా భారం మంత్రులు వహించవలసి వచ్చింది. సహజంగానే, ఆశ్రిత పక్షపాతం, లంచగొండి తనం అధికమయ్యాయి.

ఆ రాజ్యంలో సింహబలుడనే యువకు డుండేవాడు. వాడికినాఅన్నవారులేరు. అయినా, కష్టపడి విద్యనభ్యసించడమేగాకుండా, సైన్యం లోచేరేందుకు అవసరమైన క్షాత్రవిద్యలలో కూడా శిక్షణ పొందాడు.

ఆ తర్వాత, రాజాస్థానంలో ఉద్యోగం కోసం మహారాజును దర్శించడానికి వెళ్ళాడు. అయితే, అతడికి ఆ అవకాశం దక్కలేదు. లంచం అడిగిన మంత్రులు, అతడి పేదరికం గుర్తించి, సభలోకి కూడా రాకుండా గెంటించి వేశారు.

మనస్తాపం చెందిన సింహబలుడికి మహా రాజుమీద, మంత్రులమీద జుగుప్స కలిగింది. వాడిక మరి ఉద్యోగ ప్రయత్నం చేయక, వేటాడి జీవనం కొనసాగించాలని నిశ్చయిం చుకున్నాడు. ధనుర్బాణాలు ధరించి, వాడు రాజ్య సరిహద్దుల్లో ఉన్న దండకారణ్యంలో జంతువులను వేటాడి కడుపు నింపుకోసాగాడు.

కొద్ది సంవత్సరాలు గడిచాయి. విక్రమ సేనుడికి ఆరోగ్యం పాడయింది. రాజవైద్యులు పరీక్షించి ఏవో మందులిచ్చారు. గుణం కని పించలేదు. ఆ సమయాన రత్నాకరుడనేవృద్ధ వైద్యుడు, రాజును పరీక్షించి "మహారాజా, అమృతవల్లి అనే వనమూలికతోతమ వ్యాధి నయం కాగలదు. అయితే, ఆ మూలికను సంపాయించడం కష్టం," అన్నాడు.

అక్కడే వున్న విక్రమసేనుడి కుమారుడు అగ్నిసేనుడు, రత్నాకరుడితో, "ఆ వనమూలిక ఎలా ఉంటుందో, ఏ ప్రాంతాన దొరుకు తుందో చెప్పండి. దాన్ని ఎన్ని కష్టాలకైనాఓర్చి తేగలను," అన్నాడు.

ఎన్. శివనాగేశ్వరరావు



అప్పుడు రత్నాకరుడు ఆ వనమూలిక ఎలా ఉండేదీ వర్ణించి, ఆ మూలిక దండకారణ్యంలోని తూర్పు ప్రాంతాన గల కొండల్లో లభించగదలని చెప్పాడు.

దండకారణ్యం ఎంతటి భయంకరమైనదో చంద్రశిలారాజ్యంలో వారందరికీ తెలుసు. ఒకసారి యువరాజు అగ్నిసేనుడు తెగించి, కొందరు భటులతో ఆ ప్రాంతాలకు వేటకు పోయి, వేట మాట అలా ఉంచి, అక్కడి క్రూరమృగాలు, విషసర్పాల బారిన పడకుండా కొసప్రాణాలతో పారిపోయివచ్చాడు. ఆ సమయంలో అతడికి ఆటవికుల ద్వారా, అతి నేర్పరీ, నిర్భయుడూ అయిన సింహ బలుణ్ణి గురించి తెలిసింది.

అగ్నిసేనుడు భటులను పంపి, సింహ బలుణ్ణి పిలిపించాడు. వాడికి అప్పటికే అగ్నిసేనుణ్ణి గురించి తెలుసు. తండ్రి భోగ లాలసుడైతే, ఇతడు ప్రజల క్షేమం ఏమాత్రం పట్టించుకోని క్రూరుడు.

అగ్నిసేనుడు, సింహబలుడికి తగు మర్యాదలు చేసి, "సింహబలా! మహారాజు వ్యాధి గ్రస్తుడన్న సంగతి నువ్వు ఎరిగే ఉంటావు. అమృతవల్లి అనే మూలిక ద్వారా, ఆయన వ్యాధిని కుదర్చవచ్చని వైద్యుడు చెప్పాడు. దాన్ని సంపాయించేందుకు నువ్వు సాయపడాలి. నువ్వు కోరిన ధనం ఇవ్వగలను," అని వైద్యుడు చెప్పిన వివరాలన్నీ అతడికి చెప్పాడు.

దానికి సింహబలుడు, "యువరాజా! ధనం మాట అలా ఉంచండి. నా దృష్టిలో పరోపకారాన్ని మించిన సంపదలంటూ లేవు. మీకు తప్పక సాయం చేస్తాను," అన్నాడు.

మర్నాడు ఇద్దరూ అశ్వాల నధిరోహించి దండకారణ్యంచేరారు.సింహబలుడుముందు అశ్వాన్ని నడిపిస్తూ,అక్కడక్కడా తమ మార్గానికి అడ్డుగా ఉన్న పొదలను నరికి, మార్గం సుగమం చేయసాగాడు. అలాంటి సమయాలలో సర్పాలు బుసలు కొడుతూ దాపులనున్న మహావృక్షాలపైకి పాకిపోయాయి.

నాలుగు రోజుల ప్రయాణం తర్వాత వాళ్ళు ఒక సాయంసమయంలో వైద్యుడు చెప్పిన తూర్పుకొండల ప్రాంతాన్ని చేరారు.

సింహబలుడు ఉత్సాహంగా, "యువరాజా! మనం ఇప్పుడు వైద్యుడు చెప్పిన ప్రదేశానికి వచ్చాం. ఆయన వర్ణించిన ప్రకారం అమృత వల్లి, ఒక అడుగు కన్న ఎత్తు పెరగనిమొక్క. గుడ్రాల మీద ఉండి దాన్ని గుర్తించడం కష్టం. మనం కాలినడకన, ఈ చుట్టుపక్కల

దాని కోసం నిదానంగా వెదుకుదాం," అన్నాడు.

ఇద్దరూ అశ్వాల మీదినుంచి దిగి, వాటిని ఒక చెట్టుకు కట్టివేసి, అమృతవల్లి కోసం వెదకసాగారు. అయితే, వాళ్ళు గమనించని విషయమేమిటంటే - అక్కడికి దాపులనే ఉన్న కొండగుహలో రక్తతర్పణుడనే రాక్షసుడున్న సంగతి!

ఈ రక్తతర్పణుడు రాక్షసుల్లో అత్యుత్తమ జాతికి చెందినవాడు. వాడి పూర్వులు దండకారణ్యాన్ని ఏలిన వాళ్ళు. తక్కువ జాతి రాక్షసులులాగా దొరికిన ఏ జంతువునో తినిఆకలి చల్లార్చుకోవడం, వాడికి అవమానకరంగా తోచేది. ఈ లోకాన్ని వదిలిపోయే ముందు, ఏదో ఒకనాడు ఒక మనిషిని తిని తీరతానని వాడు శపథం చేశాడు.

వాడికిప్పుడు, ఒకరు కాదు ఇద్దరు మనుషులు కంటబడడంతో, ఒళ్ళు పొంగిపోయి, తను కూర్చున్న పెద్దబండరాయి మీదినుంచి భీకరంగా హుంకరిస్తూ కిందికి దూకి, వాళ్ళకేసి పరిగెత్తుకు రాసాగాడు.

వాడి హుంకారం వింటూనే సింహబలుడూ, యువరాజు అగ్నిసేనుడూ నిలువెల్లా కంపించిపోయారు. అగ్నిసేనుడు మూర్ఛపోబోతూన్నవాడిలా ఊగిపోతూ, "సింహబలా! ఇప్పుడేది దారి? ఆ ముసలి వైద్యుడు మనలను రాక్షసులకు ఆహారంగా వేయడానికి, అమృతవల్లి కట్టుకథ అల్లాడని, నా అనుమానం. మననిప్పుడా భగవంతుడే రక్షించాలి!" అన్నాడు.

సింహబలుడు, అగ్నిసేనుడు నేల బడకుండా గట్టిగా పట్టుకొని, "యువరాజా! మీ తండ్రిగారి భోగలాలసత్వంతో పాటు, మీ



క్రూరత్వం కూడా రాజ్యంలో అందరూ ఎరిగిందే! ఈ రాక్షసుడు మహాక్రూరుడని గతంలో విన్నాను. ఇప్పుడు మన రక్షణ భారం భగవంతుడికి అప్పగించేందుకు తగిన వ్యవధి లేదు. ఒర నుంచి కత్తి దూయండి!" అంటూ విల్లులో సంధించేందుకు బాణాన్ని అందుకోబోయాడు.

అంతలో రాక్షసుడు, వాళ్ళను సమీపించి బాణం గురిచేస్తున్న సింహబలుణ్ణీ, వెనక్కు పారిపోజూస్తున్న యువరాజు అగ్నిసేనుణ్ణీ చెరొక చేత్తో పైకెత్తి పట్టుకొని, "ఆహా! నా శపథం ఫలించింది! అయితే, తాళవృక్షమంత ధర్మసందేహం! కాలధర్మం చెందేలోపలనేను తినదలచింది ఒక మనిషినే; కాని ఇప్పుడిద్దరుదొరికారు! ఏం చేయాలి?" అంటూ ఇద్దరికేసి తల తిప్పుతూ చూడసాగాడు.

అప్పుడు, సింహబలుడు, "రాక్షసోత్తమా! నీకు ధర్మా ధర్మ విచక్షణాజ్ఞానం ఉన్నందుకు చాలా ఆనందిస్తున్నాను. చావుబ్రతుకుల మధ్య వున్న చంద్రశిలా రాజ్యం రాజుకు చికిత్స చేసేందుకు, అమృతవల్లి అనే మూలిక కోసం ఇక్కడికి వచ్చాం. ఈయన ఆ రాజ్యం యువరాజు. ఆ మూలిక ఎక్కడ దొరుకుతుందో చెబితే, దాన్ని తీసుకుని యువరాజు వెళ్ళి పోతాడు. అప్పుడు నువ్వు, నన్ను తినవచ్చు. నీ శపథానికి ఏ భంగపాటూ కలగదు," అన్నాడు.

వెంటనే రాక్షసుడు, వాళ్ళిద్దరినీ కిందికి దించి, సింహబలుడితో, "ఆ అమృతవల్లి మూలిక ఈ ప్రాంతాలనే ఉన్నది; ఇస్తాను. ఇప్పుడు నాకు మరొక సందేహం కలుగు తున్నది. లోకంలో కన్నవాళ్ళ కోసం పిల్లలు త్యాగాలు చేయడం పరిపాటి. అటువంటిది, ఈ యువరాజు సామాన్య పౌరుడివైన నిన్ను బలిపెట్టి, తన ప్రాణాలు కాపాడుకోవడం ధర్మ మవు తుందా?" అన్నాడు.

ఆ మరుక్షణం అగ్నిసేనుడు, రెండుచేతు లతో రాక్షసుడిపాదాలు పట్టుకుని, "రాక్ష సేంద్రా! మీమాటలతో నాకళ్ళుతెరిపించారు. మా రాజ్య ప్రజలు నాతండ్రిభోగలాలసత్వాన్ని అసహ్యం చుకుంటారు. నా క్రూరత్వాన్ని ద్వేషిస్తారు. ఇది తెలిసీ పాలకుడు, సామాన్య ప్రజలు విశ్వసించే ధర్మాధర్మాలకు అతీతుడని అహంకరించాను. దయవుంచి, అమృతవల్లి మూలి కను సింహ బలుడికిచ్చి, నన్ను భక్షించండి!" అన్నాడు.

ఇది వింటూనే రాక్షసుడు చుట్టుపక్కల గల చెట్టుచేమలు ఊగిపోయేలా వికవిక మంటూ పెద్దగా నవ్వి, "నువ్వనే దయ, దానితో పాటు జాలీ, కరుణా అనేవి రాక్షసనైజానికి విరుద్ధం; పాటించకూడనివి. అయినా, మీ కోసం నా నైజాన్ని త్యాగం చేస్తున్నాను, రండి!" అంటూ వాళ్ళను కొంతదూరం తీసుకుపోయి, అక్కడ వున్న పొదల్లో నుంచి అడుగుఎత్తులో ఉన్న అమృతవల్లి మూలిక పొదులనువేళ్ళతో సహా పెకలించి, వాళ్ళకు ఇస్తూ, "ఒకటి కాదు, రెండు తీసుకుపొండి. అయితే, నా శపథం, శపథంగానే మిగిలి పోయింది. ఇందుకుకారణం, ఏదో రాక్షస స్వభావ విరుద్ధమైన దుష్కార్యం చేసి వుంటాను!" అని పెద్దగా నిట్టూర్చుతూ గుహకేసి బయలుదేరాడు.

ఆ తర్వాత సింహబలుడూ, యువరాజూ పరమానందంతో తమతమ అశ్వాల నధి రోహించి, నగరంకేసి బయలుదేరారు.





# బంగారు గడియలు -9

## ప్రపంచంలో వీటిని మనం ఎక్కడ చూడగలం...

### ... కోలా ఎలుగుబంట్లు?

కోలా ఎలుగుబంటి పిల్లలు, కంగారూ పిల్లల లాగే, తొలి ఆరునెలలు తమ తల్లుల కడుపు కింది సంచులలోనే గడుపుతాయి. ఆహారం తినేప్పుడు అల్లరిగా ప్రవర్తించే వీటి ముఖ్యమైన ఆహారం యూకలిప్టస్ ఆకులు. ఈ జంతువులు ఎక్కడ నివసిస్తాయి?





### ... సముద్రకన్య విగ్రహం?

ప్రపంచ ప్రసిద్ధిగాంచిన పిల్లల కథారచయిత హాన్ క్రిస్టియన్ యాండర్సన్ జ్ఞాపకార్థం ఒక చిన్న సముద్ర కన్య విగ్రహం ప్రతిష్ఠించారు. ఈ కాంస్యవిగ్రహం ఒక రేవు ముఖద్వారంలో ఉన్నది. అది ఎక్కడో తెలుసా?



### ... మేడమ్ టుస్సాడ్స్ వాక్స్ మ్యూజియం?

మేరీ టుస్సాడ్స్ అనే ఫ్రెంచి వనిత 1834వ సం॥లో ఒక వస్తుప్రదర్శనశాలను స్థాపించింది. అది ఈనాడుసుప్రసిద్ధ వ్యక్తుల మైనపు బొమ్మల ప్రదర్శనశాలగా ప్రపంచ ప్రసిద్ధిగాంచింది. ఈ వస్తుప్రదర్శనశాల ఎక్కడ ఉన్నది?

### బంగారుద్వారం వంతెన?

ప్రపంచంలోకెల్లా చాలా అందమైన వంతెనగా బంగారుద్వారం వంతెనను చెబుతారు. 1220 మీటర్ల పొడవైన ఈ వంతెన 1937వ సం॥లో నిర్మించబడింది. దీనిని దాటాలంటే ఎక్కడికి వెళ్ళాలో తెలుసా?





# ప్రశ్నావళి



1. ఇద్దరు అరబ్బులు ప్రయాణం చేస్తున్నారు. ఒకరి వద్ద 3 రొట్టెలు, రెండవ వ్యక్తి వద్ద 5 రొట్టెలు ఉన్నాయి. దారిలో మూడవ వ్యక్తిని చూశారు. అయన దగ్గర రొట్టెలు లేవు గాని చాలా ఆకలితో ఉన్నాడు.
అరబ్బులు అతన్ని తినడానికి పిలిచి, తమ దగ్గరున్న 8 రొట్టెలను ముగ్గురూ సమానంగా పంచుకుని తిన్నారు. ఆ తరవాత మూడవ ప్రయాణీకుడు తాను తిన్న రొట్టెలకని 8 వెండి నాణాలు ఇచ్చివెళ్ళాడు. ఇద్దరు అరబ్బులు ఆ పైకాన్ని న్యాయసమ్మతంగా ఎలా పంచుకోవాలి?





2. ఒక చిన్న గొడుగు కింద ముగ్గురు లావుపాటి మనుషులు ఒకరినొకరు తోసుకుంటూ నడుస్తున్నారు. అయినా, ఒక్కరూ తడవలేదు. ఎందువల్ల?

3. అరటి తొక్కలతో జర్మనులు ఏం చేసుకుంటారు?

4. ఒక బస్సు ఖాళీగా బయలుదేరింది. మొదటిస్టాపులో 16మంది ఎక్కారు, మళ్ళీ ఆగడంతో ఏడుగురు ఎక్కారు, ముగ్గురు దిగారు. ఆ తరవాతి స్టాపులో 9 మంది ప్రయాణీకులు ఎక్కారు, ఐదుగురు దిగారు. బస్సు మళ్ళీ ఆగాక ఐదుగురు ప్రయాణీకులు ఎక్కారు, ముగ్గురు దిగారు. ఆఖరిస్టాపులో ఇద్దరు దిగారు. మొత్తంమీద బస్సు ఎన్నిస్టాపుల్లో ఆగింది?

5. మూడు జేబురుమాళ్ళు – రెండు తెల్లవి, ఒకటి ఎర్రనిది– ఒకదానికొకటి ముడివేయబడ్డాయి. రెండు తెల్లరుమాళ్ళు ఒకదానికొకటీ; ఎర్ర రుమాలు, తెల్లరుమాలుకూ ముడివేయ బడ్డాయి. అంటే ఒక తెల్ల రుమాలు మధ్యలో ఉందన్నమాట. ఇప్పుడు ముడులు విప్పకుండా ఎర్రరుమాలును రెండు తెల్లరుమాళ్ళ మధ్యకు తీసుకురావాలంటే ఏంచేయాలి?



6. శబ్ద అవరోధాన్ని అధిగమించడానికి మనిషి నిర్మించిన మొట్టమొదటి వస్తువు ఏది?

7. ఆ క్షణం క్రితం నీళ్ళతో నింపబడిన గ్లాసుమీద తట్టాను. గ్లాసునుంచి ఒక నీటి చుక్కకూడా బయటికి రాలేదు. కాని టేబుల్ క్లాత్ తడిసిపోయింది. ఎలా?

8. యుద్ధం వల్ల నాశనమైన ఒక గ్రామంలో కొందరు మనుషులు మిగిలారు.మనిషిరోజుకు ఒక లీటర్ తాగినట్టయితే అక్కడున్న నీళ్ళు 13 రోజులకు వస్తాయని వాళ్ళకు తెలిసింది. ఐదవ రోజు ప్రమాదవశాత్తు కొంత నీళ్ళు వలికిపోయాయి. ఆ రోజే తన వంతు నీళ్ళను తాగేసి, ఒక మనిషి గాయాల కారణంగా చని పోయాడు. ఆ తరవాత నీళ్ళ వాటాను తగ్గించలేదు. మిగిలిన నీళ్ళు వాళ్ళనుకున్నట్టే 13 రోజులకు వచ్చాయి. కింద వలికిపోయిన నీరు ఎంత?

**9.** న్యాయస్థానం నాటకం:
బస్సులో ప్రయాణం చేస్తూన్న బల్వంత్ శర్మ, బస్సు హఠాత్తుగా ఆగడంతో, ఆ కుదుపుకు తాను కూర్చున్న సీటు నుంచి ఎగిరి దూరంగా పడ్డాడు. కుడి చేతికి గాయం తగిలింది. ఈ చేతిని ఇకపై ఉపయోగించలేను. కాబట్టి పదిలక్షల రూపాయలు నష్టపరిహారం చెల్లించాలి – అని రవాణాసంస్థ మీద కేసుపెట్టాడు శర్మ. రవాణా సంస్థ తరఫున కోర్టులో హాజరయిన న్యాయవాది శర్మను, చేతిని ఎంతవరకు పైకెత్తగలవో చూపించు – అన్నాడు. శర్మ చేతిని భుజం వరకు ఎత్తాడు. "సరే, ప్రమాదం జరగకముందు ఎంతవరకు ఎత్తగలిగేవాడివో ఇప్పుడు చూపించు," అన్నాడు న్యాయవాది. శర్మచేతిని తలపైకి ఎత్తి చూపాడు.
"చూశారా? ఈ పెద్దమనిషి అబద్ధమాడుతున్నాడని తేలిపోయింది. చేతిని ఎప్పటిలా పైకెత్తగలగడం మనమందరం చూశాం. అసలు చేతికి గాయమే తగలలేదు. కాబట్టి, ఈ కేసును కొట్టివేయాలని కోర్టువారిని వేడుకుంటున్నాను!" అని న్యాయవాది ముగించాడు.అయినా, న్యాయమూర్తి అందుకు అంగీకరించలేదు. ఎందువల్ల?



**బంగారు గడియలు- 8 సమాధానాలు:**

1. రాజస్థాన్‌లోని రాణక్‌పూర్ ఆదినాథ్ ఆలయం 2. కాశ్మీర్‌లోని అమర్‌నాథ్.
3. ఈస్టర్ ఐలండ్ ఆదిమవాసులు.

## ప్రయత్నించండి!

# బాడీ రోల్



ఈ బంతి ఆటను సరదాగా ఆడుకోవచ్చు.

ఎ. టెన్నిస్‌బాల్‌ను కుడిచేతిలో పట్టుకోండి.

బి. రెండు చేతులూ పైకెత్తి 'T'లా నిలబడండి.

సి. ఇప్పుడు చేతిలోని బంతిని కుడిచేయి మీదుగా దొర్లించండి. అది మోచేయి, భుజం, రొమ్ము మీదుగా దొర్లుకుంటూ వెళ్ళి ఎడమభుజం, మోచేయి మీదుగా,ఎడమచేతిని చేరుకుంటుంది? దీనిని సక్రమంగా చేయగలిగిన తరవాత బంతిని ఎడమచేతి నుంచి కుడిచేతికి చేరేలా దొర్లించండి!



# టెడ్డీబేర్ బొమ్మ

కావలసిన వస్తువులు:

పాత ప్లాస్టిక్ టెడ్డీబేర్; ప్లాస్టర్ ఆఫ్ పారీస్; కత్తెర: ఒక దారంముక్క; కొన్ని రంగులు.

చేసే విధానం:

1. ప్లాస్టిక్ టెడ్డీబేర్‌ను నిలువునా రెండు భాగాలుగా కత్తిరించుకోండి.
2. ప్లాస్టర్ ఆఫ్ పారీస్‌లో నీళ్ళు కలిపి, బాగా మర్దించి ముద్దగా చేసుకోండి.
3. ఈ ముద్దను కత్తిరించిన బేర్ రెండు భాగాలలో పూర్తిగా నింపి, రెంటినీ ఒకటిగా దారంతో కట్టండి.
4. ప్లాస్టర్ ఆఫ్ పారీస్ గట్టిపడేవరకు అలాగే పక్కన ఉంచండి.
5. ఆ తరవాత నెమ్మదిగా ప్లాస్టిక్ బొమ్మను వలిచివేయండి. ఇప్పుడు ప్లాస్టర్ ఆఫ్ పారీస్‌కు టెడ్డీబేర్ ఆకారం వచ్చేస్తుంది.
6. చివరగా టెడ్డీబేర్ కళ్ళూ, ముక్కూ, నోరూ వీటికి రంగులు వేయండి.

 



# మహాభారతం

పాండవులు ఒక ఏడాదిపాటు అరణ్యవాసం చేసిన తరవాత అర్జునుడు ఇంద్రలోకానికి వెళ్ళాడు. అతను అక్కడి నుంచి తిరిగి రావటానికి అయిదేళ్ళు పట్టింది. అతను వచ్చిన అనంతరం మరి నాలుగేళ్ళ పాటు వాళ్ళు గంధమాదన ప్రాంతంలోనే గడిపారు. కుబేరుడి అనుమతితోనూ, కుబేరుడు ఏర్పాటు చేసిన యక్షుల సహాయంతోనూ దివ్యమైన ఆ ప్రదేశాల సౌందర్యం తనివితీరా చూశారు. వారి అరణ్యవాసంలో పదేళ్ళు నిండి, పదకొండో ఏడు మొదలయింది. ఇంక త్వరలో పన్నెండేళ్ళు పూర్తి అవుతాయి. తరవాత వాళ్ళు అజ్ఞాతవాసం కూడా విజయవంతంగా ముగించి కౌరవుల మీద పగ తీర్చుకుంటారు. పగ తీర్చుకునే సమయం కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నట్టు భీముడు మాటల సందర్భంలో ఒకసారి ధర్మరాజుతో పైకే అనేశాడు. పైకి అనక పోయినా, అర్జున నకుల సహదేవులు కూడా చాలా ఆత్రంగానే ఉన్నారు.

ఈ సంగతి ధర్మరాజు గ్రహించి, ఈ దేవప్రాంతాలను విడిచి తిరిగి వెళ్ళటానికి నిశ్చయించాడు. భీముడు తలచుకోగానే ఘటోత్కచుడు తన అనుచరులతో సహా వచ్చి, పాండవులను వృషపర్వుడి ఆశ్రమానికి చేర్చాడు. అక్కడి నుంచి వారు బదరికారణ్యానికి వచ్చి, అందమైన ఆ అరణ్యంలో ఒక మాసం ఉండి, కిరాత దేశం చేరి, సుబాహుపురానికి వచ్చి పడ్డారు. ఇంద్రసేనుడూ, విశోకుడూ మొదలుగా గల పాండవ భృత్యులు ఒకప్పుడు అక్కడే దిగబడిపోయారు. అక్కడి నుంచి ఘటోత్కచుణ్ణీ, అతని అనుచరులనూ పంపేసి, పాండవులు తమ భృత్యులను కలుపుకుని కాలినడకన హిమాలయాలలోని విశాఖయూపం చేరుకున్నారు.

## 32. భీమ విమోచనం



ఈ ప్రాంతంలో వేటాడదగిన మృగాలు ఎన్నయినా ఉన్నాయి. వేట మీది వ్యామోహం కొద్దీ పాండవులు ఒక ఏడాది పాటు ఆ ప్రాంతంలోనే ఉండిపోయారు.

ఒకనాడు భీముడు తగిన ఆయుధాలు తీసుకుని వేటకు బయలుదేరి అనేక మృగాలను చంపుతూ వెళ్ళివెళ్ళి ఒక మహాసర్పాన్ని చూశాడు. అది ఆకుపచ్చ రంగులో ఉన్నది. దాని నోరు కొండగుహలాగున్నది. అందులో నాలుగు భయంకరమైన కోరలున్నాయి. దాని కళ్ళు ప్రకాశిస్తున్నాయి. దాని నోటి నుంచి విషజ్వాలలు వెలువడి, చుట్టూఉన్న చెట్లను మాడ్చేస్తున్నాయి.

అలాటి ప్రళయనాగును భీముడు పొగరుగా ఎదిరించాడు. వెంటనే అది భీముడి శరీరాన్ని బలంగా చుట్టివేసింది. ఒక్క క్షణం విస్తుపోయిన భీముడు, దాని నుంచి బయటపడడానికి ప్రయత్నించాడు. వెయ్యి ఏనుగుల బలం గల భీముడు ఎంత ప్రయత్నించీ దాని పట్టు నుంచి తప్పించుకోలేక నిర్ఘాంతపోయాడు.

ఈలోపల ధర్మరాజు, భీముడెంతకూ తిరిగిరాకపోవటం చూసి, అతను బయలుదేరిన దిక్కు తెలుసుకుని, ద్రౌపదికి రక్షగా అర్జున నకుల సహదేవులను ఉండమని, చెప్పి ధౌమ్యుడితో సహా అరణ్యమార్గాన బయలు దేరాడు. దారి పొడుగునా, భీముడి చేతచచ్చిన వివిధ మృగాలు గుట్టలు గుట్టలుగా పడి ఉండటంచేత దారి వెతుక్కునే అవసరం లేకపోయింది.

అలా పోగా చివరకు ధర్మరాజుకు భీముడు పాము చుట్టలతో అసహాయుడై చిక్కి, కనిపించాడు. అతను పోయి అలా పామునోటిలో ఎందుకు చిక్కుకోవలిసిన అవసరం కలిగిందో ధర్మరాజుకు అర్థం కాలేదు. ఆయన పామును సంబోధించి, "సర్పరాజా, నీకు ఆహారం కావాలంటే మరేదన్నా అడుగు, ఇస్తాను. ఇతను నా తమ్ముడు. ఇతన్ని వదిలిపెట్టు," అన్నాడు.

దానికా సర్పం, "అయ్యా, నాకు నీ తమ్ముడు దైవికంగా దొరికాడు. నేను అతన్ని వదలను. అతను నా ఆహారం. నువ్వుకూడా ఇక్కడే ఉండిపోయేటట్టుంటే, రేపు నిన్ను మింగుతా!" అన్నది.

ఈ జవాబు విని, "నువ్వు ఎవరు?" అని ధర్మరాజు సర్పాన్ని అడిగాడు.

"నేను మీ పూర్వీకుణ్ణి. నా పేరు నహుషుడు. చంద్రుడికి ఏడోతరం వాణ్ణి. బతికి ఉండగా



అంతులేని పుణ్యాలు చేసి, అమితమైన తపస్సు చేసి ఇంద్రపదవి సంపాదించాను. ఇంద్రపదవి రాగానే పొగరు తలకెక్కి బ్రాహ్మణులను అవమానించాను. అగస్త్యుడనే ముని నా మీద ఆగ్రహించి, పాముపు కమ్మని శపించాడు. అయితే ఆ ముని అనుగ్రహం తోనే నాకు పూర్వస్మృతీ, అంతు లేని బలమూ కలిగాయి. ఎవరు నా ప్రశ్నలకు సరిఅయిన సమాధానాలిచ్చినా నాకు శాపవిముక్తి కలిగేటట్టు కూడా ఆయనే అనుగ్రహించాడు,' అని సర్పం అన్నది.

"అలా అయితే, నా శక్తికి తగినట్టుగా సమాధానాలిస్తాను. నీ ప్రశ్నలు అడుగు," అన్నాడు ధర్మరాజు.

"బ్రాహ్మణుడంటే ఎలాటివాడు? అతను తెలుసుకోదగినది ఏది?"అనిసర్పంఅడిగింది.

"నాకు తోచిన సమాధానం చెబుతాను. ఎవడిలో సత్యమూ, దానమూ, ఓర్పూ, తపస్సూ, దయా, కనికరమూ ఉంటాయో వాడు బ్రాహ్మణుడు. వాడు తెలుసుకోదగినది ఏదంటే – దుఃఖం లేనిదీ, సుఖం లేనిదీ అయిన పరబ్రహ్మం," అన్నాడు ధర్మరాజు.

"రాజా, నువ్వు చెప్పిన గుణాలన్నీ శూద్రుడిలో ఉంటే వాణ్ణి బ్రాహ్మణుడన వచ్చునా? సుఖదుఃఖాలకు అతీతమైన పరబ్రహ్మం అన్నావుకదా, సుఖదుఃఖాలకు అతీతమైనది ప్రపంచంలో ఏదీ లేదా?"అని సర్పం మళ్ళీ అడిగింది.

"సత్వాది గుణాలు శూద్రుడిలో ఉంటే వాడు శూద్రుడూ కాడు; అవి లేనివాడుబ్రాహ్మణుడూ కాడు. ప్రవర్తనే సర్వోత్తమమైనది. శీతోష్ణాల మధ్య మరేదీ లేనట్టుగా, సుఖదుఃఖాలకు భిన్నమైనది కూడా లోకంలో ఏదీలేదు. అలాటి ద్వంద్వాలకు అతీతమైనది పరబ్రహ్మం ఒక్కటే అనుకుంటున్నాను," అన్నాడు ధర్మరాజు.

"ప్రవర్తనే అత్యుత్తమ మన్నావు గదా, ప్రవర్తన చేతనే ఎవడైనా బ్రాహ్మణుడయ్యేటట్టుంటే వర్ణాశ్రమాల ఏర్పాటు వృధాయే గదా?" అని సర్పం అడిగింది.

దానికి ధర్మరాజు,"మాట్లాడటమూ, పుట్టటమూ, చావటమూ, బిడ్డలను కనటమూ సర్వమానవులకూ సమానమే. అయితే, పూర్వం ప్రమాదవశాన జాతిసాంకర్యం కలిగిన కారణంచేత వర్ణవిభజన అవసరం అయింది. అంతేగాని, వేదాలు తెలిసినవారికి ప్రవర్తనే ప్రధానం. బ్రాహ్మణస్త్రీకి పుట్టినవాడు వేద సంస్కారం పొందేవరకూ శూద్రుడితో సమా

నుడే. తరవాత వాడు క్రమంగా సత్వాది గుణాలు అలవరచుకుని బ్రాహ్మణుడవు తాడు. అలాటి గుణాలు గల శూద్రుడు సచ్ఛూద్రుడని స్వాయంభువమనువు పూర్వం చెప్పాడు," అన్నాడు.

అప్పుడు సర్పం, "నీ సమాధానాలకుసంతో షించాను. నీ తమ్ముణ్ణి నేను కబళించను," అంటూ శాపం వదిలి, పూర్వపు నహుషరూపం పొందింది. అంతలో స్వర్గం నుంచి విమానం రాగా, నహుషుడు అందులో ఎక్కి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

తరవాత ధర్మరాజు భీముణ్ణి వెంటబెట్టు కుని, ధౌమ్యుడితో సహా తమ పర్ణశాలకు తిరిగివచ్చి, మిగిలిన వాళ్ళకు జరిగినది చెప్పాడు.




"భీముడికి ఈ దుస్సాహస మేమిటి? ధర్మరాజు ఎంత గొప్పజ్ఞాని!" అని అందరూ ఆశ్చర్యపడ్డారు.

పాండవులు వర్షాకాలం వెళ్ళిపోయేదాకా ద్వైతవనంలోనే ఉండి, తమ వెంట బ్రాహ్మణు లనూ, పరివారాన్నీ తీసుకుని బయలుదేరి కామ్యకవనానికి చేరుకున్నారు. అక్కడి ఋషులు వారిని చక్కగా ఆదరించారు.

ఇంతలో పాండవులను చూడటానికి సత్యభామతో సహా కృష్ణుడు వారున్నచోటికి వచ్చాడు. అతను, పాండవులందరూ వింటూ ఉండగా, ధర్మరాజుతో, "రాజా, నువ్వు ఇంతకాలం అడవులలో నివసించి కూడా ఆటవిక ధర్మాలు అవలంబించక రాజ ధర్మాన్ని నిలిపావు. ధర్మరాజు అనే పేరు నీకు సార్థకమయింది. మీ నియమకాలం గడవగానే నీ శత్రువులను యముడి వద్దకు పంపటానికి మేమంతా తోడువస్తాము. నువ్వు వైభవంగా రాజ్యమేలుతావన్నది నిశ్చయం," అని, ద్రౌపదితో, "పాంచాలీ, దుర్యోధనుడు మొదలైనవారికి కాలం మూడింది. నీ బిడ్డ లను సుభద్ర చక్కగా చూసుకుంటున్నది. ప్రద్యుమ్నుడు వారికి విలువిద్యలు నేర్పు తున్నాడు," అన్నాడు.

ధర్మరాజు కృష్ణుడికి నమస్కరించి, "నువ్వే మాకుదిక్కు. అరణ్యవాసం అయిపోవచ్చింది. నీ దయవల్ల అజ్ఞాతవాసం కూడా పూర్తిచేశా మంటే, అటుతరవాత మేము ఏం చెయ్యాలో నువ్వే ఆజ్ఞాపింతువు గాని," అన్నాడు.

కృష్ణుడు పాండవుల వద్ద ఉండగానే అక్కడికి మార్కండేయుడు వచ్చాడు. ఆయన వయసు చాలా దీర్ఘమైనది. కాని చూడడానికి ఇరవైయేళ్ళ వాడిలాగా కనిపిస్తూ గొప్ప



ఆ రహస్యం ఏమిటో నాకు కూడా కాస్త చెప్పావంటే, నేనుకూడా నా భర్తను వశపరచు కుంటాను," అన్నది.

దానికి ద్రౌపది, "సత్యభామా, నువ్వు చెప్పే వశీకరణ మార్గాలు చెడ్డస్త్రీలు అవలంబించేవి. కృష్ణుడి వంటివాడికి భార్యవైన నువ్వు ఇలా అడగటమే తప్పు. నన్ను గురించి నీకు సందేహం రావటంకూడా తప్పే. తన భార్య మందులూ, మంత్రాలూ ప్రయోగిస్తుందని తెలిసినాక మగవాడు ఆమెను విష సర్పాన్ని చూసినట్టు చూడడా? పాండవులు నా పట్ల ప్రేమగా ఉండటానికి కారణాలు చెబుతాను విను: నేను లేనిపోని కోరికలు కోరి, అవి తీర్చక పోతే అలిగి కూర్చోను. భర్తలకు నా మీద విశ్వాసం ఉన్నది గదా అని వారికి జరగవలసిన ఉపచారాల విషయంలో అశ్రద్ధ చెయ్యను. వారి సేవలు నేనే చేస్తాను గాని, పనిమనుషుల చేత చేయించను. వారికి ఇష్టమైన వంటలు నాచేతి మీదుగా చేసి, నేనే పెడతాను. వారు చెప్పేదానికీ, చేసేదానికీ నేనెన్నడూ ఎదురు చెప్పను. అకారణంగా నవ్వను. నా సవతులను చూసి అసూయ పడను. ధర్మరాజు ఇంద్రప్రస్థంలో రాజ్యం చేసే కాలంలో రోజూ అనేక వేలమంది బ్రాహ్మణులూ, బ్రహ్మచార్లూ, సన్యాసులూ అతిథులుగా ఉండేవారు. వారికి అన్నీ సక్రమంగా జరిగినదీ, లేనిదీ నేనే స్వయంగా చూసేదాన్ని. అంతేకాదు, పాండవుల ఇతర భార్యలూ, లక్షలాది దాసీ జనమూ, పశువుల కాపర్ల దగ్గిర నుంచీ ఎందరో ఉండేవారు; ఆ అందరి యోగ క్షేమాలూ నేనే చూసేదాన్ని.

తేజస్సుతో వెలిగిపోతూండేవాడు. మార్కండేయుడు అక్కడ చేరిన వారికిఅనేక కథలూ, అనుసరించవలసిన ధర్మాలూ చెప్పాలనుకున్నారు.

ఆశ్రమం వెలుపల ఈ గోష్ఠి సాగుతూ ఉండగా, ఆశ్రమం లోపల సత్యభామా, ద్రౌపదీ ఏకాంతంగా కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు.

ఆ సమయంలో సత్యభామ ద్రౌపదితో, "నీ భర్తలు దిక్పాలకులకు తీసిపోనివారు గద్దా, అలాంటివారు అయిదుగురూ నీకు వశులై, ఎన్నడుగాని నీకు అయిష్టం కలగకుండా, ఎంతో ఆదరంగా చూడటానికిఏమిటి కారణం? వారిని వశపరచుకోవటానికి నోము లేవైనా నోచావా? మంత్రాలూ, మూలికలూ మొదలైన వశీకరణాలు ప్రయోగించావా?

చివరకు బొక్కసం జమా ఖర్చులు కూడా నేనే చూసేదాన్ని. కుటుంబ భారమంతా నేనే మోసేదాన్ని. అందుకనే నా భర్తలకు నాపైన అంత విశ్వాసమూ, స్నేహమూనూ. అంతేగాని మందులూ, మాకులూ, మంత్రాలూ, తంత్రాలూ నా వద్ద ఏమీలేవు," అన్నది.

సత్యభామ ఈ మాటలు విని, "నిన్ను ఇలా అడిగినందుకు నాకు చాలా పశ్చాత్తాపం కలుగుతున్నది. నా మీద కోపం ఉంచకు. నవ్వులకు అడిగాననుకో," అన్నది.

తరవాత మార్కండేయమహాముని, సత్యభామా కృష్ణులూ పాండవుల వద్ద సెలవు తీసుకుని, ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. అప్పుడే పాండవులు కూడా కామ్యకవనాన్ని వదిలిపెట్టి తిరిగి ద్వైతవనానికి వచ్చి, ఒక అందమైన ప్రదేశంలో, ఒక సరస్సుతీరాన పర్ణశాల నిర్మించి, అందులో కాపరం పెట్టారు.

పాండవులు ద్వైతవనంలో ఉంటూండగా ఆ వనంలో ఉండే ఒక బ్రాహ్మణుడు హస్తినాపురానికి వెళ్ళి, ధృతరాష్ట్రుణ్ణి కలుసుకుని, "మహారాజా, నేను ద్వైతవనం నుంచి వస్తున్నాను. అక్కడ పాండవులు చలికీ, వేడికీ, గాలికీ కూడా గురిఅయి నానా అవస్థలూ పడుతున్నారు. లోకాలను జయించగల అయిదుగురు భర్తలుండి కూడా ద్రౌపది అనాథలాగా అరణ్యంలో పడరాని అగచాట్లు పడుతున్నది," అన్నాడు.

ఈ మాట విని ధృతరాష్ట్రుడు లోలోపల కుమిలిపోయాడు. ఎందుకంటే, పాండవుల పాట్లన్నిటికీ తన ఉపేక్షే కారణమని ఆయనకు తెలుసు. ఆయన ఆ బ్రాహ్మణుడితో, "నా కొడుకు లందరి కన్న కూడా ధర్మరాజు ఉత్తముడు. అతని మనసులో కోపం అనేది ఉండదు. అర్జునుడుధర్మరాజుకు విధేయుడు. భీముడు అలాకాదు. అతను మహాబలుడు. అతని మనసులో కోపం ఎప్పుడూ ఉంటుంది. అయితే ధర్మరాజు మాటకు కట్టుపడి భీముడు విజృంభించకుండాఅణిగిపడిఉన్నాడు. ఇంతకూ నా కొడుకు దుర్యోధనుడు దష్ట బుద్ధి గలవాడు. వాడి దుర్మార్గమే ఇన్నికష్టాలకూ కారణం. రేపు వాడు ఆ పాండవులకు అర్ధ రాజ్యం ఇస్తే ఏ బాధా వుండదు. కాని వాడివ్వడు. అది వాడి స్వభావానికి విరుద్ధం. అదే వాడి వినాశానికి దారి తీస్తుందేమో!" అంటూ పెద్దగా నిట్టూర్పులు విడిచాడు.



# కోపిష్ఠిఉద్యోగి

రావులపాడు జమీలో, అడవి ప్రాంతాల వున్న కొన్ని గ్రామాల రైతులు, రెండు మూడు సంవత్సరాలుగా తగిన వర్షాలు లేక సరిగా శిస్తులు కట్టలేకపోతున్నారు. అక్కడి జమీందారు ఉద్యోగి వరదరాజులు చాలా ఉదారబుద్ధి కలవాడు. ఆయన రైతుల ఇక్కట్లు చూసి, శిస్తులవసూళ్ళ విషయంలో వాళ్ళను బలవంత పరచలేకపోయాడు.అందువల్ల దివాణానికి చేరవలసిన డబ్బుచేరలేదు.ఇందుకు కారణం ఏమిటో వరద రాజులు దివాణానికి తెలియబరచినా, జమీందారు అదేం పట్టించుకోక, వరదరాజులును ఉద్యోగం నుంచి తొలగించి, శేషఫణి అనే ఆయన్ను అక్కడికి పంపమని దివాన్‌జీకి చెప్పాడు.

ఈ శేషఫణి ముక్కోపి, దయాదాక్షిణ్యాలు లేనివాడు. ఆయన ఆ ప్రాంతంలోని ఒక పెద్దగ్రామంలో కచ్చేరీ ఏర్పాటు చేసుకుని, ఇరవై నాలుగ్గంటల్లో బకాయిలతో పాటు మొత్తం శిస్తు చెల్లించని రైతుల వీపులమీద గుండురాళ్ళు పెట్టిస్తానని, చాటింపు వేయించాడు. ఆ గ్రామంలో ప్రతాపుడనే యువకుడొక డున్నాడు. వాడు మంచి తెలివితేటలతోపాటు సమయస్ఫూర్తికలవాడు. చాటింపు వింటూనే వాడు, శేష ఫణి దగ్గరకు పోయి నమస్కరించి,"అయ్యా! ఈ ప్రాంతంలో వానలు లేక పంటలు పండడంలేదు. దీనికి తోడు బందిపోట్ల బెడద ఎక్కువైంది," అన్నాడు.

బందిపోట్ల మాట వింటూనే శేషఫణి గతుక్కుమని, అంతలోనే సర్దుకుని, "నేనిక్కడికి వచ్చింది వానలు కురిపించడానిక్కాదు; శిస్తు వసూళ్ళకు. మాటవరసకడుగుతున్నాను – బందిపోట్ల నుంచి రక్షణకు మీరేం చేస్తున్నారు?" అని అడిగాడు."మంచి జాతికుక్కలను పెంచుతున్నాం," అన్నాడు ప్రతాపుడు.

"అవి ఎక్కడ దొరుకుతాయి?" అని ప్రశ్నించాడు శేషఫణి కాస్త వణుకుతూ.

"నా దగ్గరేవున్నవి. అవి కొత్తవాళ్ళు కంటబడగానే, హెూ,హెూ, అని అరవడం ప్రారంభిస్తాయి," అన్నాడు ప్రతాపుడు. దానికి శేషఫణి ఈసడింపుగా, "జాతికుక్కలు హెూ,హెూ అని అరవవు. ఇలా –భౌ, భౌ అంటవి," అని భౌ,భౌ అని అరవడం ప్రారంభించాడు. ఇది విన్న ఆయన నౌకర్లు పరుగుపరుగునపోయి, జమీం దారుకు సంగతి చెప్పారు. జమీందారు, దివాన్‌జీని పిలిచి, "ఈ శేషఫణికి ఆ ప్రాంతాన ఏదో గాలో ధూళో సోకినట్టున్నది. మీరు వెంటనే వెళ్ళి సంగతి సందర్భాలు తెలుసుకుని, ఏంచేయాలో స్వయంగా నిర్ణయించండి," అని చెప్పాడు.

దివాన్‌జీ వెళ్ళి రైతుల గోడంతావిని, వరదరాజులును తిరిగి ఉద్యోగంలోపెట్టి, సలహాదారుగాప్రతాపుణ్ణి నియమించాడు.

–దామరపూడి శేషగిరిరావు



# అరటిచెట్టు

మామిడి, పనస, అరటి పళ్ళను ప్రధానమైన మూడుఫలాలుగా చెబుతారు. అదేవిధంగా అరటి, మామిడి, రేగు, అత్తి, చింత చెట్లను ముఖ్యమైన ఐదు వృక్షాలుగా చెప్పుకుంటారు. వీటికి సంబంధించిన ఒక వింతకథ కొన్నిప్రాంతాలలోప్రచారంలో ఉన్నది. ఈ ఐదుచెట్లూ ఒకానొకప్పుడు మానవ రూపాలతో ఐదుగురు అక్కచెల్లెళ్ళుగా ఉండేవట. వాళ్ళకు ఎంతకూ పెళ్ళికాలేదు. దేవుడు వాళ్ళకు కనిపించి పెళ్ళిచేసుకుంటారా అనిఅడిగాడు. అక్కలు నలుగురూఒప్పుకున్నారుకాని, ఆఖరిచెల్లెలు మాత్రం పెళ్ళికి ఒప్పుకోలేదు; అయితే, సంతానంమాత్రం కోరుకున్నది. దేవుడు వాళ్ళను చెట్లుగా మార్చేసి, ఆ చెట్లపైకి ఎగబ్రాకిన పురుషులే వాటికి భర్తలవుతారని చెప్పాడట!

అందుకే మిగతాచెట్లను పైకి ఎగబ్రాకగలం కాని, పెళ్లివద్దన్న ఆఖరి చెల్లెలయిన అరటిచెట్టు పైకి మాత్రం వెళ్ళలేమని ఈ కథ చెబుతుంది!

అరటిని సంస్కృతంలో మోచా అనీ, కదళిఅనీ అంటారు. హిందీలో కేలా అనీ, ఇంగ్లీషులోబనానా, ప్లాంటెన్, ఆడమ్స్ ఆపిల్ అనీ అంటారు. పలు భారతీయ భాషలలో అరటిని కదళి అని అంటారు.

తమిళంలోనూ మలయాళంలోనూ వాళై అని అంటారు.

బౌద్ధులు అరటిని పవిత్రంగా భావిస్తారు. బౌద్ధ సాహిత్యంలో చెప్పబడిన 'మోచాపానాను' అరటితో తయారుచేస్తారు. మన పురాణాల ప్రకారం హనుమంతుడు హిమాలయ ప్రాంతాలలోని కదళీవనం అనే అరటితోటలో ఉంటాడు.

అరటిపువ్వులు, కాయలు, పళ్ళు, ఊచ అన్నీ ఆహారంగా ఉపయోగపడతాయి.

కాయలు పచ్చగా ఉన్నప్పటికీ పళ్ళు పచ్చగానూ, పసుపుపచ్చగానూ, ఎర్రగానూ ఉంటాయి. పరిమాణంలో చిన్నవీ పెద్దవీ అంటూ తేడాలుంటాయి. అరటిలో 5000 రకాలున్నాయంటారు. పచ్చరటి, బొంతరటి, కొండరటి, చక్కెరకేళి, అమృతకేళి మొదలైన పదిరకాలు ప్రసిద్ధమైనవి.

అరటి ఆకులు పెద్దవి ఐదారడుగులపొడవు తోనూ, బాగా వెడల్పుగానూ ఉంటాయి. దక్షిణ భారతదేశంలో వీటిని భోజనం చేయడానికి విస్తరాకులుగా ఉపయోగిస్తారు.

వివాహాదిశుభకార్యాలసమయంలో పందిళ్ళనూ, ద్వారతోరణాలనూ పువ్వులూ, గెలలూ గల అరటి చెట్లతో అలంకరిస్తారు. వీటిని చాలా శుభప్రదంగా భావిస్తారు.

గెలవేసి, కాయలు బాగా ముదిరిన తరవాత చెట్లను నరికేస్తారు. నరికిన చెట్టుబోదె చుట్టూ ఏర్పడిన దుంపల నుంచి కొత్త మొక్కలు పుట్టుకు వస్తాయి.



మనదేశపు ఋషులు:

# భరద్వాజుడు

మనిషి ఎన్నేళ్ళు జీవించినా సరే ఇంకా కొంతకాలం జీవించాలనే కోరుకుంటాడు. ఇది సహజం. అయితే, అలా జీవించాలనుకోవడం ఉన్నతాశయ సాధనకోసం అయినప్పుడు ఆ కోరిక విజ్ఞుల మన్ననలందుకుంటుంది. సప్తర్షులలో ఒకడైన భరద్వాజ మునిఉదంతం ఇందుకు ఒకచక్కని ఉదాహరణ.

అత్రిమహామునికుమారుడైనభరద్వాజుడు, ఆదికావ్యం రామాయణ కర్త అయిన వాల్మీకి మహాముని శిష్యుడుగా వేదమంత్రాలను అభ్యసించాడు. అయినా, ఆయన జ్ఞానదాహం తీరలేదు.

ఇంద్రాది దేవతల దీవెనలు పొంది, భరద్వాజుడు సుదీర్ఘకాలం జీవించాడు. జీవితకాలమంతా వేదాధ్యయనంతోనూ, ధ్యానంతోనూ గడిపాడు. అవసానదశ ఆసన్నమయింది. భరద్వాజుడు మళ్ళీ దేవనాధుడైన ఇంద్రుణ్ణి ధ్యానించి మరింత ఆయుష్షును ప్రసాదించమని ప్రార్థించాడు.

ఇంద్రుడు ప్రత్యక్షమై భరద్వాజుణ్ణి తన వెంట రమ్మని కొంతదూరం వెళ్ళాడు. దూరంగా ఎత్తయిన మూడుకొండలు కనిపిస్తున్నాయి. ఇంద్రుడు భరద్వాజుణ్ణి దోసిలి పట్టమని, మూడుగుప్పెళ్ళ ఇసుక తీసి ఆయన దోసిట్లో పోశాడు. భరద్వాజుడు మౌనంగా ఊరుకున్నాడు.

"దూరంగా కనిపిస్తూన్న మూడుకొండలతో పోల్చిస్తే, నీ దోసిట్లోని ఇసుక పరిమాణం ఎంత?" అని అడిగాడు ఇంద్రుడు.

"అత్యల్పం. పోల్చలేనంత తక్కువ!" అన్నాడు భరద్వాజుడు.

"నువ్వు నేర్చిన వేదజ్ఞానం కూడా అలాంటిదే! నువ్వు తెలుసుకున్నది పిడికెడంత; తెలుసుకోవలసినది ఆ కొండంత!" అన్నాడు ఇంద్రుడు.

భరద్వాజుడు తన మాటలకు బెదిరిపోయి, తాను నేర్చుకున్నది చాలు అని గానీ; లేదా నాకు అన్నీ తెలుసుఅని అహంకారంతో సమాధానం ఇవ్వగలడని ఇంద్రుడు భావించాడు. కాని భరద్వాజుడు కొంతసేపు మౌనంగా ఊరుకుని ఆ తరవాత, "ఆహా! జ్ఞానం అంత గొప్పదా! అయితే దానిని పరిపూర్ణంగా సాధించాలి! తమ ఆశీస్సులు లభిస్తే, ఆ మూడు కొండలను జయించడానికి ప్రయత్నిస్తాను!" అన్నాడు ఎంతో వినయంగా.

భరద్వాజుడి అచంచలమైన ఆత్మవిశ్వాసానికీ, ఉన్నత లక్ష్యానికీ అమితాశ్చర్యం చెందిన ఇంద్రుడు ఆయనకు మరొక జీవితకాలం ఆయుష్షును ప్రసాదించి అంతర్ధానమయ్యాడు!



# మీకు తెలుసా?

1. తాజ్‌మహల్ ఉన్న ఆగ్రాకు ఆపేరు, అగ్రాబనా అనే మాట నుంచి వచ్చింది. దాని అర్థం ఏమిటి?
2. 1972వ సం॥లో పులిని మన జాతీయ మృగంగా ప్రకటించారు. అంతకు పూర్వం మన జాతీయ మృగం ఏది?
3. బంగ్లాదేశ్‌కు, ఆ దేశపితగా పేరుగాంచిన ముజిబూర్ రహమాన్ కుమార్తె షేక్ హసీనా ఈ నాటి ప్రధాన మంత్రి అయ్యారు. ఇండోనేషియాలో ప్రస్తుత ప్రధాని సుహార్తోతో, సుకర్నో కుమార్తె ప్రధానంగా అధికారానికి పోటీపడుతున్నది. ఆమె పేరేమిటి?
4. మన ప్రధాని దేవెగౌడ కర్నాటక రాష్ట్రానికి చెందినవారని తెలుసు. మరి ఏ జిల్లాకు చెందినవారో తెలుసా?
5. హిరోషిమా, నాగసాకీల మీద అణుబాంబులు వేసిన తరవాత జపాను లొంగిపోవడంతో రెండవ ప్రపంచ యుద్ధం ముగిసింది. అయినా అమెరికా నాగసాకీ మీద బాంబు వేయాలని మొదట అనుకోలేదు. మరి ఏ నగరం మీద వేయాలనుకున్నారు?
6. మామూలుగా వంటగదులలో కనిపించే ఒక కీటకం బాంబుల తాకిడిని కూడా తట్టుకుని బతక గలదు. ఆ కీటకం ఏదో తెలుసా?
7. ఆఫ్రికాలో ఓవెన్ జలపాతం ఎక్కడ ఉన్నది?
8. ఆధునిక ఒలిపింక్ క్రీడలు 1896లో ఆరంభమయినప్పటికీ ఒలింపిక్ ప్రమాణ స్వీకారం చేయడం ఆ తరవాత ఆచరణలోకి వచ్చింది. ఎప్పుడు?
9. 1960వ సం॥లో మనదేశంలో ప్రప్రథమంగా ఎస్.టి.డి ప్రవేశపెట్టడం జరిగింది. అప్పుడు ఏ రెండు నగరాలను కలిపారు?
10. పిల్లలకు చాలా ఇష్టమైనదాన్ని ఇటాలో మార్సియోనీ కనుగొన్నాడు. అది ఏమిటి?
11. 1815లో అమెరికాలో ఆరంభమైన ఒక క్రీడ తరవాత ఆసియాదేశాలలో చాలా ప్రాచుర్యం పొందింది. ఆ క్రీడ ఏది?
12. 'కామన్వెల్త్ గేమ్స్' ప్రాచీన నామం ఏది?
13. ఫస్ట్ టెస్ట్ సెంచరీ సాధించిన మొట్టమొదటి భారతీయ క్రికెట్ క్రీడాకారుడు ఎవరు?
14. పద్మశ్రీ, పద్మభూషణ్, పద్మవిభూషణ్, భారతరత్న ఈ నాలుగు బిరుదులనూ పొందిన భారతీయుడుఎవరు?
15. 'ప్లానింగ్ కమిషన్' మొట్టమొదట ఏ సంవత్సరంలో ఏర్పాటు చేయబడింది. మొదటి ఉపాధ్యక్షుడుఎవరు?

## సమాధానాలు

1. స్వర్గ ఉద్యానం.
2. సింహం.
3. మేఘావతి సుకర్నోపుత్రి.
4. హసన్.
5. హిరోషిమా సమీపంలోని కొకూరా.
6. బొద్దింక.
7. ఉగాండా.
8. 1920, ఆంట్వర్ప్ ఒలింపిక్స్‌నుంచి.
9. లక్నో-కాన్పూర్‌లమధ్య.
10. ఐస్‌క్రీమ్‌కోన్.
11. వాలీబాల్.
12. బ్రిటిష్ ఎంపైర్ గేమ్స్.
13. లాలా అమర్‌నాథ్.
14. సత్యజిత్‌రాయ్.
15. 1950లో. ప్రొఫెసర్ మహలనోబిస్.

# చందమామ కబుర్లు

## ఆకాశం నుంచి లాల్లీపాప్స్!

తాయ్‌వాన్ (ఫార్మోసా) రాజధాని తాయ్‌పీయ్ నగరంలో ఉన్నట్టుండి. పెద్దగా హెలికాప్టర్ శబ్దం వినిపించింది. పిల్లలందరూ ఇళ్ళ నుంచి వెలుపలికి పరుగెత్తుకుంటూ వచ్చి ఆకాశం కేసి చూశారు. లాల్లీపాప్‌లా ఆకాశంలో ఎర్రటి హెలికాప్టర్ కనిపించింది. అది దగ్గరికి వచ్చినప్పుడు మరొక విషయం



తెలియ వచ్చింది. దానిని నడపడానికి పైలట్‌లేడు! రిమోట్‌కంట్రోల్‌తో ఏర్పాటు చేసిన రేడియోతరంగాల సహాయంతో అది ఎగురుతున్నది. పిల్లలకు ఆఖరుగా కలిగిన మరొక ఆనందకరమైన ఆశ్చర్యం ఏమంటే అది ఆకాశంలో కొంతసేపు తిరిగి, వెళ్ళేప్పుడు నిజమైన లాల్లీపాప్స్‌ను వెదజల్లి వెళ్ళింది!

## అతిపెద్ద బ్యానర్!

ఇటీవల బయటపడ్డ అతి భయంకరమైన వ్యాధి ఎయిడ్స్. దీనికి మందులే లేవు. ఈ వ్యాధి రాకుండా జాగ్రత్తపడడం ఒక్కటే దీనినుంచి తప్పించుకోవడానికి మార్గం. ఈ విషయాన్ని మామూలు ప్రజలకు తెలియజేయడం ఎంతైనా అవసరం. ఈ నిజాన్ని గుర్తించిన అన్ని దేశాలూ – సభలు, సమావేశాలు జరపడంతోపాటు రేడియో, టీవీ, పత్రికలు మొదలైన ప్రచారసాధనాల ద్వారా ఎయిడ్స్ రాకుండా ఉండాలంటే తీసుకోవలసిన జాగ్రత్తల గురించి తీవ్రంగా ప్రచారం చేస్తున్నాయి. రోజు రోజుకూ ఎయిడ్స్ వ్యాధిగ్రస్తుల సంఖ్య పెరుగుతున్నదన్నది అందో ళనకరమైన విషయం. ఈ మహమ్మారిని అరికట్టాలని డిసెంబర్ 1వతేది ప్రపంచవ్యాప్తంగా ఎయిడ్స్ దినం జరిపారు. బొంబాయిలో ఎయిడ్స్ దినానికి ముందు రోజు దాదాపు 10,000 మంది పాల్గొన్న ఒకపెద్ద ఊరేగింపు జరిగింది. ఊరేగింపులో ఎయిడ్స్ వ్యాధికి సంబంధించిన నినాదాలుగల ఒక బ్రహ్మాండ మైన బ్యానర్‌ను పట్టుకుని నడిచారు. ఈ బ్యానర్ పొడవు ఎంతో తెలుసా? 4.5 కి.మీ. ప్రపంచంలో ఇంతవరకు తయారు చేసిన బ్యానర్లలో కెల్లా ఇదే పెద్దదయి వుంటుందని భావిస్తున్నారు. ఈ బ్యానర్ ఊరేగింపు ద్వారా వేలాదిమందికిఎయిడ్స్ గురించిన సమాచారం అందివుంటుందనడంలో సందేహం లేదు!

## డబ్బులిచ్చే శాంతాక్లజ్!

బెర్లిన్ విశ్వవిద్యాలయ ప్రాంగణంలోని ఒక గదిలో ప్రత్యేకమైన తరగతిని ఏర్పాటు చేశారు. ఆ తరగతికి హాజరయిన వాళ్ళందరూ ఆ విశ్వవిద్యాలయంలో చదువుతూన్న విద్యార్థులే. అయితే అందరూ కూడా శాంతాక్లజ్‌లాగా ఎర్ర అంగీలతో, తెల్లటి గడ్డాలతో ముసలివేషాల్లో వచ్చారు. ఎందుకో తెలుసా? శాంతాక్లజ్‌లా ఎలా నటించాలో తెలుసుకోవడానికి వాళ్ళు అలావచ్చారు. క్రిస్మస్ సమయంలో



శాంతాక్లజ్ (సెయింట్ నికొలస్) లాగా నటించడానికి యూరపు దేశాలలోని కొన్ని సంస్థలు పారితోషికం చెల్లిస్తాయి. ఆ విధంగా ఉత్సాహవంతులయిన యువకులు క్రిస్మస్ సందర్భంగా కొంత పాకెట్‌మనీ సంపాయించుకుంటారు!



# తండ్రి కోరిక

పూర్వం సమీరుడనే ఆయనకు ముగ్గురు కొడుకులు, ఒక కూతురు ఉండేవారు. కడ గొట్టుదైన సత్యవతి మూడేళ్ళ ప్రాయంలో వున్నప్పుడు, సమీరుడి భార్య విషజ్వరంతో కన్ను మూసింది. ఆ సమయంలో సమీరుడు వర్తకపు పనులమీద ద్వీపాంతరంలోవున్నాడు.

కొన్నాళ్ళకు తిరిగి వచ్చిన సమీరుడు జరిగింది తెలుసుకుని, బిడ్డలను అక్కున చేర్చుకుని బావురుమన్నాడు. ఆ తర్వాత ఆయన నౌకర్లు వున్నప్పటి స్వయంగాపిల్లల ఆలనా పాలనా చూసుకుంటూ, వ్యాపా రం గురించి పూర్తిగా మరిచిపోయాడు. అందు వల్ల, పోటీ తప్పనిసరి అయిన వజ్రాల వర్తకంలో సమీరు డికి, ఉన్న ఆస్తి పాస్తులు తరిగిపోయే పరిస్థితి ఏర్పడింది.

సమీరుడు ఇది గుర్తించి, వెంటనే తిరిగి వ్యాపారం పనులామీద బయలుదేరేందుకు ఏర్పాటు చేసుకోసాగాడు. ఆ సమయంలో గోదావరి పుష్కరాలు వచ్చాయి. ఆయన కూతురు సత్యవతిని వెంటబెట్టుకుని పుష్కర స్నానాలకు బయలుదేరాడు.

ఆ పని ముగించుకుని తిరిగి వచ్చిన సమీరుడు, ఇంట ప్రవేశిస్తూనే, "సత్యవతీ! అమ్మా, సత్యవతీ!" అంటూ కుప్పకూలి పోయాడు. "ఏమైంది, నాన్నా! చెల్లెలు ఏదీ?" అని చుట్టుముట్టిన కొడుకులతో, "ఇంకెక్కడి చెల్లెలు బాబూ! ఆ పుష్కరాల్లో ఎటో తప్పి పోయింది," అన్నాడు.

ఇది జరిగిన కొద్ది వారాల తర్వాత సమీ రుడు, కొడుకుల బాధ్యత నౌకర్లకు అప్పగించి, ఓడలో ద్వీపాంతరాలకు వెళ్ళిపోయాడు.

పదేళ్ళు గడిచిపోయాయి. ముగ్గురు కొడు కులూ బాగా పెద్దవాళ్ళయ్యారు. ఈ పదేళ్ళ కాలంలో సమీరుడు పది రోజులు కూడా ఇంటిపట్టున గడిపి ఎరగడు. దివారాత్రాలు సమీరుడికి సముద్రం మీదే గడిచిపోయేవి.

మల్లవరపు మనోహరరెడ్డి



ఇలావుండగా – ఒకసారి కొడుకులను చూడవచ్చిన సమీరుడు, ముగ్గురు కొడుకులనూ దగ్గరకు పిలిచి, "నాయనలారా! ఈ వజ్రాలవర్తకం వల్ల, నా జీవితంలో ఎక్కువ కాలం సముద్రం మీదే గడిచిపోయింది. ఏ తుఫాను దెబ్బకో నా బతుక్కూడా ఏదో ఒక నాడు సముద్రంపాలు కాక తప్పదేమో! ఒక వేళ అలా జరిగితే, మేడమీది ఉత్తరపుగదిలో ఒక పాత భోషాణం వున్నది. దాన్ని తెరిచి చూడండి. నా తదనంతరం మాత్రమే, ఉత్తరపు గది తలుపులు తెరవాలి సుమా! ఒక ముఖ్య విషయం; తోడబుట్టినవారికోసంఎంతటి త్యాగానికైనా సిద్ధపడడం ఉత్తమోత్తమ ధర్మం అనిపించుకుంటుంది,"అని హితబోధ చేసి, రొండిన వున్న ఉత్తరపు గదితాళం చెవిని వాళ్ళకిచ్చాడు.

ఆతర్వాత కొద్దిరోజులకు సమీరుడు, వర్తకం పనిమీద మరొకసారి బయలుదేరాడు. అతడెక్కిన ఓడ సముద్ర మధ్యంలో పెను తుఫానుకు గురిఅయి మునిగి పోయింది. ప్రయాణీకులందరూ నీటిపాలు కాగా, ఇద్దరు కళాసులు మాత్రం ఓడ కొయ్యల ఆధారంగా బతికి బయటపడ్డారు. వాళ్ళద్వారా సమీరుడి కొడుకులకు తండ్రి మరణవార్త తెలిసింది.

సమీరుడి ముగ్గురు కొడుకులూ, ఈ దుర్వార్త విని చాలా దుఃఖించారు. పెద్దవాడు, ఇద్దరు తమ్ములతో, "ఇలా జరగవచ్చనిముందే శంకించిన నాన్నగారు, మనకు ఉత్తరపు గది తాళం చెవి ఇచ్చారు. మనం వెళ్ళి, ఆ గదిలోని భోషాణంలో ఏమున్నదో చూసి, ఆయన చివరికోరిక నెరవేరుద్దాం," అన్నాడు.

ముగ్గురన్నదమ్ములూ ఉత్తరపుగది తలుపులు తెరిచి, భోషాణం తలుపు పైకెత్తి లోపలికి చూశారు. భోషాణం వెక్కిరిస్తున్నట్టుబోసిగా వున్నది. వాళ్ళు ఊహించినట్టుగా అందులో డబ్బూ, బంగారం ఏమీ లేదు గానీ, ఒక చిన్న కాగితంముక్క మాత్రం ఉన్నది. ఆ ఉత్తరం చదివి ముగ్గురూ విస్తుపోయారు. అందులో సమీరుడు–సిరిపురంలో వుండే భూపతి అనే ఆయన, నాబాల్యమిత్రుడు. ఆయన కుమార్తెకు, మీ సొంత ఖర్చులతో వివాహం జరిపించండి. మీ తండ్రిగా ఇదే నా చివరికోరిక!" అని వున్నది.

ఆ రాత్రి అన్నదమ్ములెవరికీ కంటి మీద కునుకులేదు. పెద్దవాడు కోపం పట్టలేక, మనసులో – ఈయన ఏమన్న తండ్రి!చేతికి చిల్లిగవ్వ ఇవ్వకుండా సముద్రం పాలైపోయాడు. ఇప్పుడు, ఎవరింటి ఆడపిల్లకో పెళ్ళిచేసి

ఆయన కోరిక తీర్చడానికీ,తమ్ముళ్ళకు ఏదైనా బతుకు తెరువు చూపించడానికీ, నేనేమైనా మతిమాలిన వాడినా? అనుకుని,రాత్రికి రాత్రే ఎటో వెళ్ళిపోయాడు.

తెల్లవారాక, తమ అన్న ఇల్లొదిలిపోయాడని గ్రహించారు ఇద్దరన్నదమ్ములు. అప్పుడు చిన్నవాడు, రెండవవాడితో, "మనమైనా నాన్నగారి చివరికోరిక తీరుద్దాం. ఈ ఇల్లు అమ్మి వచ్చిన డబ్బుతో భూపతి కూతురు పెళ్ళిచేద్దాం. ఆ తర్వాత ఎక్కడైనా నౌకరీకి కుదిరి, మనం బతుకుదాం," అన్నాడు.

ఇందుకు రెండోవాడు సరేనన్నాడు.

ఆ తర్వాత ఇద్దరూ వారం తిరక్కుండానే ఇల్లమ్మి, ఆ డబ్బుతో సిరిపురం బయల్దేరారు. సాయంకాలానికి వాళ్ళొక చిన్న గ్రామంచేరారు. గ్రామాధికారి ఇంటి ముందు ఏదో పంచాయితీ జరుగుతున్నది. వాళ్ళు అక్కడికి వెళ్ళారు. ఇద్దరు యువకులు, ఒక వృద్ధురాలు తీర్పుకోసం నిలబడివున్నారు. జనంలో ఒకణ్ణి, విషయం ఏమిటని అడిగారు అన్నదమ్ములు.

దానికి వాడు, "ఆ ముసలావిడకు ఇద్దరు కొడుకులతో బాటు, పెళ్ళీడుకొచ్చిన కూతురున్నది. తండ్రి బతికుండగా అందరూ కలిసి మెలిసివున్నారు.ఆయన పోగానే, ఆస్తిని కొడుకులు ఇద్దరూ పంచుకుని తల్లినీ, చెల్లెలినీ వదిలి వెళ్ళిపోయారు. తండ్రికి మాట ఇచ్చిన ప్రకారం, చెల్లెలికి పెళ్ళిచేయమంటుంది తల్లి. వాళ్ళు మాత్రం –ఉన్నదంతా ఖర్చుచేసి అలా పెళ్ళి చేస్తే, మా పిల్లలగతేం కాను! అంటూ మొండి కెత్తుతున్నారు. ఈ సమస్య నెలా పరిష్కరించాలా అని పంచాయితీదార్లు చర్చలు చేస్తున్నారు,"అనిచెప్పాడు.



అన్నదమ్ములిద్దరూ అక్కణ్ణించి బయలుదేరి, ఒక పూటకూళ్ళ ఇంట్లో భోజనం చేసి, ఆ రాత్రికి అక్కడే పడుకున్నారు. రెండోవాడికి తెగని ఆలోచనలతో ఎంతకూ నిద్ర పట్టలేదు. వాడు చివరకు, "ముసలావిడ కొడుకులు సొంతచెల్లెలికే పెళ్ళిచేయడానికి ససేమిరా అంటున్నప్పుడు, ఎవరో ముక్కూ మొహం తెలియని సిరిపురం భూపతి కూతురుకు, ఇల్లమ్మిన డబ్బుతో పెళ్ళెందుకు చేయాలి? ఉన్న కాస్త డబ్బుపరాయి వాళ్ళకోసం ఖర్చుపెట్టకుండా, దానితో ఏవ్యాపారమో చేసి సుఖంగా బతకవచ్చు! అని నిర్ణయించుకుని, డబ్బుసంచీతో రాత్రికిరాత్రే ఎటో పారిపోయాడు.

తెల్లవారి నిద్రలేచిన మూడోవాడికి, అన్నగానీ డబ్బు సంచీగానీ కనబడకుండా పోయేసరికి, సంగతి అర్థమైంది. వాడు భార మంతా

దేవుడి మీదవేసి సిరిపురం బయలు దేరాడు.

రెండు రోజుల కాలినడక తర్వాత చిన్న వాడు సిరిపురం చేరుకున్నాడు. వాడు వాకబు చేసి, భూపతి ఇల్లు తెలుసుకుని, ఆయనుం టున్న నాలుగంతస్తులమేడ చూసి, "ఇంత ధనవంతుడి కూతురుకు నేనేమిటి పెళ్ళి చేయడం!" అనుకుంటూ ఆశ్చర్యపోయాడు.

తర్వాత వాడు మేడ గుమ్మాన్ని సమీపించి, "భూపతిగారూ!"అని పిలిచేసరికి, ఒక వయసు పైబడ్డ ఆజానుబాహువు తలుపుతెరిచి, "భూప తిని నేనే! ఏంకావాలి?" అని అడిగాడు.

"నేను సమీరుడనే ఆయన మూడో కొడు కును. మా నాన్నగారు తన చివరికోరికగా, మీ అమ్మాయికి మా ఖర్చులతో వివాహం జరిపించ మని కోరాడు. తెచ్చిన డబ్బుదారిలో పోయింది. దయచేసి మీరు కొంత గడువిస్తే, ఏ కూలీనాలో చేసి కూడబెట్టి, మీ అమ్మాయి వివాహం చేసి, మా నాన్నగారి చివరికోరిక నెరువేర్చుతాను," అన్నాడు చిన్నవాడు.

భూపతి, వాడు చెప్పిందివిని, ఆప్యాయంగా వాడి భుజం మీద చేయివేసిలోపలికి తీసుకు వెళ్ళి కూర్చోబెట్టి, "మీ నాన్నా, నేనూ బాల్య మిత్రులం. మీ తండ్రి చనిపోయిన వార్తవిని, నేనింకా కోలుకోలేని స్థితిలో వున్నాను. ఆయన మీ భవిష్యత్తు కోసం ఎంతో శ్రద్ధ తీసుకు న్నాడు.తను ఎక్కువగా ఇంటిపట్టున వుండ నందువల్ల, ఆడపిల్ల ఆలనాపాలనా సరిగా చూసే వాళ్ళుండరని, పుష్కరాల్లో తప్పి పోయి నట్టు మీకు చెప్పి, సత్యవతిని నా సంరక్షణలో వుంచాడు. అలాగే ఆయన వర్తకంలో సంపా యించిన లక్షలకొద్దీ డబ్బూ, నా దగ్గరే దాచి వుంచి, 'నాతదనంతరం, నా ముగ్గురు కొడు కుల్లో ఎవడైతే నీ గుమ్మం దాకా వస్తాడో,వాడే నేను పెట్టిన పరీక్షలో నెగ్గినట్టు లెక్క . వాడికే నా ఆస్తి అంతా ఇచ్చి, సత్యవతి గురించిన అసలు సంగతి చెప్పు!' అనికోరాడు. తండ్రి పెట్టిన పరీక్షలో నెగ్గి, నువ్వు తండ్రికి తగిన తనయుడవనిపించుకున్నావు. సరే, ముందు నీ కోసం ఒళ్లంతా కళ్ళు చేసుకుని ఎదురు చూస్తున్న, నీచెల్లెల్ని చూడు!" అని సత్యవతిని పిలిచాడు.

భూపతి చెప్పింది విని ఆశ్చర్యపోతున్న చిన్నవాడు, సర్వాభరణాలూ ధరించి బాల లక్ష్మీదేవిలా, తనకేసి నడిచివస్తున్న చెల్లెలు సత్యవతిని చూసి పరవశత్వంతో, కళ్ళవెంట ఆనందబాష్పాలు రాల్చాడు.





# అపూర్వవస్తువు

భవానీనగరంలో జయవర్మ అని ఒక గొప్ప ధనికుడు ఉండేవాడు. ఆయనకు జయపా లుడూ, విజయుడూ, జయుడూ అనిముగ్గురు కుమారులుండేవారు. వారిమధ్య వయసులో గాని, రూపురేఖలలోగాని, విద్యావినయాదు లలోగాని అటే వ్యత్యాసం ఉండేదికాదు.

నిజంగా ఆ అన్నదమ్ములు చాలా బుద్ధి మంతులు, అన్యోన్యప్రేమ గలవారు. వారి మధ్య రహస్యాలు లేవు. ఒక్క విషయం మటుకు వారు ఒకరితో ఒకరు చెప్పుకుని ఎరగరు. అదేమంటే, వారు ముగ్గురూకూడా భవానీ నగరపు రాజకుమార్తెను ప్రేమించారు. ఆమెనే ఎప్పటికైనా, ఎలాగైనా సరే పెళ్ళాడి తీరాలని ఒకరికి తెలియకుండా ఒకరుగట్టిగా తీర్మానించుకున్నారు.

వారు ముగ్గురూ ప్రతి సాయంకాలమూ రాజసౌధం పక్కగా గల ఉద్యాన వనానికి షికారు వెళ్ళేవారు. వారు వెళ్ళేవేళకు రాజ కుమార్తె నిరుపమాదేవి రాజభవనంపైన విహారంచేస్తూ వారికి కనిపించేది. ఒక్కొక్క రోజు ఆమె వీణ వాయిస్తూ సాంధ్యరాగాలు అలాపన చేయటంకూడా వారికి వినిపించేది. కాని ఆ అన్నదమ్ములుమటుకు తమలోతాము రాజకుమార్తెను గురించి ఎన్నడూ మాట్లాడు కునేవారు కారు.

ఇలా కాలం గడుస్తూవుండగా ఒకనాడు జయవర్మ తన కుమారులను ముగ్గురినీ పిలిచి ఈ విధంగా హెచ్చరించాడు:

"కుమారులారా! నేను వృద్ధుడనైపోయాను. నేను సంపాదించిన ధనంతో మీరు సుఖంగా జీవనం చేయవచ్చు. కాని అది పురుషలక్షణం కాదు. మీకు వివాహం చేసుకునే వయసు దగ్గిరపడింది. వివాహానంతరం మీకు వేరు వేరు సంసారాలేర్పడతాయి. బిడ్డలు కలుగు తారు. క్రమంగా ధనం తరిగిపోగలదు. అందు చేత మీరు పురుష ధర్మంగా దేశపర్యటన



చేసి, ధనం ఆర్జించండి. తరవాత వివాహాలు చేసుకుని హాయిగా గృహస్థాశ్రమంలో ప్రవేశించండి."

పితృవాక్యపాలకులైన ఆ యువకులు తండ్రి చెప్పిన ఈ మంచి సలహాను శిరసావహించినవారై, మంచి ముహూర్తాన కొంత ధనంతో ఇల్లు వెడలి ఉత్తరాభిముఖులై బయలుదేరారు. ఒక రోజల్లా నడిచి మహావటమనే సంతనగరం చేరారు.

ఈ సంతలో అన్నదమ్ములు ముగ్గురూ తమకునచ్చిన సరుకులను కొన్నారు. ఆనాడు శివరాత్రి. మర్నాడు ఉదయం బయలుదేరి ముగ్గురూ మూడుదిక్కులా వెళ్ళిపోయి, మళ్ళీ వచ్చే శివరాత్రినాటికి ఇక్కడే, ఈ మహావటం సంతలోనే కలుసుకునేటట్టు నిర్ణయం చేసుకున్నారు.

చూస్తూవుండగానే వారాలూ, నెలలూ గడిచాయి. మళ్ళీ శివరాత్రి వచ్చింది. మహావటంలో సంత గొప్పగా జరుగుతోంది. ఎన్నదూరాని అపూర్వవస్తువులెన్నో ఆ ఏడుసంతకు వచ్చాయి. అందరిలోకి చిన్నవాడైన జయుడు అనుకున్నప్రకారం సంత వద్దకు చేరుకున్నాడు. గడచిన సంవత్సర కాలంలో అతను ఎంతో ధనం ఆర్జించాడు. అందుచేతఅన్నలు వచ్చేలోపుగా తన దగ్గిర వున్న డబ్బులోకొంత ఖర్చుచేసి, ఏదైనా అపూర్వవస్తువు కొందామనుకున్నాడు.

ఎన్నో వస్తువులు కనిపించాయి. వాటిలో ఒకటి జయుణ్ణి ఆకర్షించింది. అదొక నిమ్మపండు. కాని అదిమామూలు నిమ్మపళ్లలాటిది కాదు. ఎవరు ఎలాటి భయంకర వ్యాధితో బాధపడుతున్నాసరే ఆ పండు కోసి నోట పిండితే తక్షణం ఆ వ్యాధి నయమవుతుంది. వెయ్యి వరహాలకు ఆ నిమ్మపండును కొని జయుడు అన్నలకోసం సంతలో ఎదురు చూడసాగాడు.

ఆ రోజునే విజయుడు కూడా అనుకున్నప్రకారం అక్కడికి తిరిగి వచ్చాడు. అతనికి కూడా వ్యాపారం అచ్చి వచ్చింది. అతను కూడా సంతలో ఒక అపూర్వ వస్తువును వెయ్యి వరహాలిచ్చి కొన్నాడు. అదేమిటంటే ఒక తివాసీ. ఐతే మామూలు తివాసీ మటుకు కాదు. దానిమీద కూర్చుని ఎక్కడికి పోవాలంటే అక్క డికి క్షణంలో పోవచ్చు.

అందరికన్న పెద్దవాడు జయపాలుడు కూడా ఆరోజే తిరిగి వచ్చాడు. అతని వద్ద కూడా చాలా ధనం పోగయింది. అతనుకూడా ఎన్నో అపూర్వ వస్తువులను బేరం చేశాడు.

ఆఖరుకు ఒక చిన్న దుకాణంలో అతనికొక అద్దం దొరికింది. దాని విలువ వెయ్యి వరహాలని చెప్పాడు దుకాణందారు.

"మామూలు అద్దానికి వెయ్యి వరహాలెందుకు? ఈ అద్దంలో గల విశేషమేమిటి?" అని అడిగాడు జయపాలుడు.

"అయ్యా,ఇది అందం చూసుకునే అద్దం కాదు.మీరు ఎవరిని తలుచుకుని ఈ అద్దంలోకి చూస్తే వారు ఆ క్షణాన ఉన్నస్థితిలో కనిపిస్తారు," అన్నాడు దుకాణదారు.

జయపాలుడి మనస్సు చటుక్కున నిరుపమాదేవివైపు పోయి, ఆమెను ఒక్కసారిచూడాలన్న అభిలాష కలిగింది. అతను సంకోచించకుండా దుకాణదారుకు వెయ్యి వరహాలూ ఎంచి ఇచ్చి అద్దం పుచ్చుకున్నాడు. నిరుపమాదేవిని తలచుకుని అద్దంలోకి చూశాడు. మరుక్షణమే అతనికి భరించరానంత బాధ కలిగి గుండె బరువెక్కింది.

ఎందుకంటే ఆ అద్దంలో జయపాలుడికి రాజకుమార్తె కనిపించింది.కాని ఆమె మరణ బాధలో వుంది. వైద్యుడు నాడి పరీక్షించి పెదవి విరిచి తల అడ్డంగా తిప్పుతున్నాడు! ఆమె జీవితం క్షణాలలో వుంది. చూస్తే,తాను సరీగా ఒక్కరోజు ప్రయాణపుదూరంలో ఉన్నాడు. కాని తను వెళ్ళేసరికి అంతా అయిపోయేలా వుంది.

చెమ్మగిల్లి, సరిగా కనిపించని కళ్ళతో దుఃఖంచేతతూలుతూ జయపాలుడుదుకాణం దాటి కొద్దిదూరం వచ్చాడో లేదో విజయుడు అతనికెదురై "అన్నా!" అని పలకరించాడు.

జయపాలుడి ప్రాణం కొంత తేరుకున్నది. "చూడు, విజయా!" అంటూ అతను అద్దంలో రాజకుమార్తె దుస్థితిని అతిడికి చూపి, ఇటువంటి ఘోర సమయంలో మనంఇంత దూరాన ఉండిపోయాం. అదే నా విచారం!" అన్నాడు.





"నీకా భయం వద్దు," అంటూ విజయుడు చంకలో వున్న తివాసీ విప్పినేలమీదపరుస్తూ, "దీనిమీద కూచుని ఒక్క క్షణంలో మనం ముగ్గురం రాజకుమార్తె శయ్యవద్ద వాల వచ్చు," అన్నాడు.

జయపాలుడికి మరికొంత ఉత్సాహం వచ్చింది. పరిచిన తివాసీమీద వాళ్ళిద్దరూ ఆసీనులు కాబోతున్న సమయంలో, "అన్న లారా!" అంటూ జయుడు వచ్చాడు.

"మాట్లాడటానికి వ్యవధి లేదు. తివాసీమీద కూచో. నిరుపమాదేవిని ప్రాణంతో ఉండగా వెళ్ళిచూద్దాం!" అన్నాడు విజయుడు.

మారు మాట్లాడకుండా జయుడు తివాసీ మీద కూర్చున్నాడు. మరుక్షణంవారు భవానీ పురరాజసౌధంలోనిరుపమాదేవిమరణశయ్య పక్కన ఉన్నారు.

జయుడు ఆమె సమీపానికి వెళ్ళి తనవద్ద వున్న నిమ్మపండును కోసి,పాలిపోయినఆమె పెదవులమధ్య రసాన్ని పిండాడు.

మరుక్షణమే రాజకుమార్తెలో ఆశ్చర్యకర మైన మార్పు కలిగింది. కొద్ది క్షణాలలోఆమె కళ్ళుతెరిచి లేచి కూర్చున్నది. అక్కడ వున్న వారంతా ఆనందాశ్రువులు రాల్చారు.

రాజబంధువుల ఆనందంకన్న సోదరుల పట్ల రాజుగారు కనబరిచిన కృతజ్ఞత అపార మైంది. ఆయన ముగ్గురుసోదరుల చేతులూ పట్టుకుని, "నాయనలారా! మీరు నాకుమార్తెను బతికించటానికి స్వర్గం నుంచి అవతరించిన దేవతలుగాని మానవమాత్రులు కారు. మీరు నా ఇంటనే ఉండి నా కుమార్తె వివాహం అయ్యేవరకూ నా ఆతిథ్యం స్వీకరించాలి," అన్నాడు. అన్నదమ్ములు సమ్మతించారు.

అయితే ఒక చిక్కు వచ్చి పడింది. తన కుమార్తె వ్యాధి కుదిర్చినవారికి ఆమెనిచ్చి వివాహంచేస్తానని రాజు చాటించి వున్నాడు. ఆ ప్రకారం ఈ ముగ్గురిలో ఎవరో ఒకరికి ఆమెనిచ్చి చేయటానికి రాజు నిశ్చయించాడు. ఈ గౌరవం ముగ్గురిలోనూ ఎవరికి దక్కు తుందో నిర్ణయించమని రాజు మంత్రిని పురమాయించాడు.

అయితే ముగ్గురి కథనమూ విన్న మీదట మంత్రికూడా అయోమయంలో పడ్డాడు.రాజ కుమార్తె ప్రాణం కాపాడినవారు ముగ్గురిలో ఎవరయినట్టు? జయపాలుడు తన అద్దంలో కనిపెట్టకపోతే నిరుపమాదేవి వ్యాధిని గురించి వారికి తెలిసి వుండదు. విజయుడి తివాసీ సహాయం లేకపోతేవారుసమయానికి రాగలిగి వుండరు. వచ్చినప్పటికీ జయుడి నిమ్మపండు

లేకపోతే ఆమె వ్యాధి నివారణ అయే వుండదు.

"పోనీ, రాజకుమార్తెను ఎవరు పెళ్లాడతారో మీలోమీరు తేల్చుకుని చెప్పండి!"అని అన్న దమ్ముల నడిగితే, ఎన్నడూ తగువులాడని ఆ సోదరులు ఆమెను నేనే పెళ్ళాడాలంటే,నేనే పెళ్ళాడాలని వాదించ సాగారు.

"మహాప్రభూ! ఇది తార్కికులవల్లగాని తేలదు. సభ ఏర్పాటుచేసి తార్కికుల నుంచి సమస్యకు పరిష్కారం కోరుదాం," అన్నాడు మంత్రి.రాజు సరేనన్నాడు.

కొద్ది రోజులలో సభ ఏర్పాటయింది. రోజులతరబడి వాగ్వాదాలుజరిగాయి.అయినా సమస్య ఉన్న చోటనే ఉండిపోయింది.చిట్ట చివరకు రాజకుమార్తె నిరుపమాదేవిజోక్యం కలిగించుకున్నది. ఈ సమస్యను పరిష్కరించే మార్గం సూచించటానికి తనకు కూడా అవ కాశం ఇమ్మని సదస్యులను వేడుకున్నది.

తాము పరిష్కరించలేని సమస్యను ఆమె పరిష్కరిస్తుందాఅనితార్కికులుఆశ్చర్యపడ్డారు.

"మీరంతా కూడా తప్పుతోవను ఆలోచిస్తు న్నట్టు నాకు తోస్తుంది. నా ప్రాణం కాపాడ టానికి ఈ ముగ్గురు సోదరులలో ఎవరు ఎక్కువ బాధ్యులనే విషయం మీరు వితర్కి స్తున్నారు. ముగ్గురూ సమంగానే బాధ్యులు. అయితే, ఒక ముఖ్యమైన విషయం మీరు ఉపేక్షించారు. అదేమిటంటే, నాకోసం ఎవరు ఎక్కువత్యాగంచేశారనేది.జయపాలుడి అద్దం, విజయుడితివాసీ,జయుడినిమ్మపండు,మూడూ నాకు ప్రాణదానం చేశాయి. అయితే జయ పాలుడి అద్దం జయపాలుడికున్నది. దానిలో ఆయన ఇతరులను చూడవచ్చు. విజయుడి తివాసీ విజయుడికున్నది,దానిపైన ఆయన ఇతర స్థలాలకు వెళ్ళవచ్చు. కాని జయుడి నిమ్మపండు ఖర్చయిపోయింది. దానితో ఆయన మరెవర్నీ బతికించుకోలేడు. నాకుభర్త కాగల వారెవరో తమరందరూ ఆలోచించి ఇప్పుడు నిర్ణయించండి!" అన్నదిరాజ కుమార్తె.

నిరుపమాదేవి బుద్ధిసూక్ష్మతకు అందరూ హర్షించారు. ఆమెకూ, జయుడికీ వైభవంగా వివాహం జరిగింది.

జయుడు తనకు అన్నివిధాలా తోడ్పడిన అన్నలిద్దరినీ గొప్పగాగౌరవించాడు. తన కుమారులు ఈ విధంగా ప్రయోజకులైనం దుకు జయవర్మ కూడా సంతోషించాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు **1997** మార్చ్ నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. SESHAGIRI



S.G. SESHAGIRI

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జనవరి నెల **15**వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అమ్మ తోడుగా అక్షరాభ్యాసం!

రెండవ ఫోటో : అలరించే అభినయ విన్యాసం!!

పంపినవారు : సి. శ్రీనివాస్,
III క్రాస్ వీధి, రాంజీ నగర్
నెల్లూరు – **524 002 (ఆం. ప్ర)**


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - **600 026**

Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

అస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 129.00 ఎయిర్ మెయిల్ ద్వారా: రూ. 276.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 135.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 276.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

# శుభ్రమైన అలవాట్లు

శుభ్రమైన పళ్ళు



శుభ్రమైన వళ్ళు



శుభ్రమైన బట్టలు



శుభ్రమైన నోట్‌బుక్స్




Apsara®
NON-DUST
ERASER

మీ వ్రాతపుస్తకాలను మరింత
శుభ్రంగా ఉంచుకునే పద్ధతి

అప్సరా నాన్-డస్ట్ ఎరేజర్ తప్పులనన్నిటినీ
స్పష్టంగా, శుభ్రంగా
చెరిపేస్తుంది - గుర్తులూ,
మరకలూ ఏమీ మిగల్చకుండానే.

హిందూస్తాన్ పెన్సిల్స్ లిమిటెడ్
వారి విశిష్ట ఉత్పాదన